# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Thursday, the 25th February 1954.**

The House met in the Assembly Chamber, Kurnool, at Eleven of the clock, Mr. Speaker (The Hon. Sri N. Venkatramaiya) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS

### Starred Questions.

*Bhairavanithippa Project.*

*151 Q—Sri S. Narayanappa :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Government have sanctioned the Bhairavanithippa Project ;

(b) if so, what the estimated amount is;

(c) the amount allotted for the construction of the project this year ;

(d) the extent of ayacut which will be irrigated under this project;

(e) the reasons under which the work of the project is not yet begun ;

(f) whether it is not included in the Five-Year Plan , and

(g) when the project work will be commenced ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—(a) The answer is in the affirmative.

(b) Rs. 78.88 lakhs for works and Rs. 93.09 lakhs including direct and indirect charges.

(c) Rs. 5,15,800.

(d) 8,000 acres.

(e) As an agreement between the Government of Mysore and this Government has not been concluded the work could not be started.

(f) The scheme has been included in the Five-Year Plan.

(g) As soon as the agreement with Mysore is completed.

[25th February 1954

Sri T. Nagi Reddi :—మైసూరు ప్రభుత్వంతో ఇంకా అగ్రిమెంటుకు రానప్పటికి రెండుసంవత్సరాల క్రితమే ఈ ప్రాజెక్టుకు పునాదిరాయి ప్రభుత్వం వేయడానికి ప్రధానమైన కారణం ఏమిటి?

The Hon. Sri N. Sanjeeva Reddi :—అప్పుడే ఆ ప్రాజెక్టుకు పునాదిరాయి వెయ్యడానికి కారణం నేనుకాదు. మైసూరు ప్రభుత్వంతో రాయబారాలు సులభంగా పరిష్కారమవుతాయని అప్పుడలాచేసి వుంటారు. అయినా వీలైనంత త్వరలో అగ్రిమెంటుకు రావడానకి కృషి చేస్తాము.

Sri S. Narayanappa :—భైరవానితిప్ప ప్రాజెక్టు విషయంలో మైసూరు ప్రభుత్వామోదం కోసం ఆంధ్రప్రభుత్వం రికమండ్ చేసినట్లు మంత్రిగారు శలవిచ్చారు. త్వరలో ఈ ప్రాజెక్టుయొక్క నిర్మాణాన్ని అమలుపర్చడానికి మైసూరు ప్రభుత్వంతో సంప్రదించడంగాని లేక ఖుద్దున ఆమోదం పొందేటట్లు చేస్తామనిగాని హామీయిస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi :—ఈపని తక్షణం జరగాలని, మైసూరుప్రభుత్వంతో మాసంప్రదింపులు ఫలిస్తాయనిఆశిస్తున్నాను. ఇంకాఅవసరమైతే నేను అక్కడికి వెళ్లడముగాని లేకవారినిక్కడికి ఆహ్వానించడంగాని జరిపి ఈ కార్యక్రమాన్ని పూర్తిచేస్తాము.

Sri Pillalamarri Venkateswarlu :—ఈప్రాజెక్టుకు గతయెన్నికలకు పూర్వం పునాదిరాయివేశారు. మళ్ళీయెన్నికలు జరిగేలోపుగానైనా ఈపనిప్రారంభం చేయిస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi :—అది ప్రారంభించడమే కాదు. ఇంకొక ప్రాజెక్టుకు పునాదిరాయి కూడా వేస్తాము.

Sri K. Rajagopala Rao :—ప్రభుత్వంయొక్క ఆర్థిక స్తోమతనూ, సాధకభాధకాలనూ ఆలోచించకుండా అడిగినదానికల్లా పునాదిరాయి వేయడంవల్ల ప్రభుత్వ ప్రతిష్ఠ తగ్గుతున్నదని మంత్రివర్గానికి తెలుసునా?

The Hon. Sri N. Sanjeeva Reddi :—పునాదరాయివేసి పంచవర్ష ప్రణాళికలో చేర్పించినందుకు ప్రతిష్ఠ పెరుగుతుందిగాని తగ్గదు. ఈమధ్యవచ్చిన అవాంతర పరిస్థితులకు ప్రభుత్వం బాధ్యత వహించదు.

25th February 1954]

Sri C. V. K. Rao :—ప్రశ్నలో (c) భాగానికి సమాధానం చెపుతూ 5 లక్షలకు పైగా ఈ సంవత్సరం ఈ ప్రాజెక్టుకు ఖర్చుపెట్ట డానికి కేటాయింపబడిందని గా॥ మంత్రిగారు చెప్పారు. కాని ఈపని ఈ సంవత్సరం ప్రారంభించబడుతుందో లేదో తెలియదని చెప్పారు. ఆర్థికసంవత్సరం పూర్తికావడానికిఒక్క నెలమాత్రమేవుందికదా! ఈఆర్థిక సంవత్సరంలోగా ఈ 5లక్షల రూపాయిలలో ఎంతోకొంతఖర్చుపెట్టాలి గదా! అటువంటప్పుడు ఈపని ఈ మార్చిలోగా కాకపోతే పై మార్చి లోగా నైనా ప్రారంభం చెయ్యడానికి ఏమైనా యేర్పాట్లు చేశారా?

The Hon. Sri N. Sanjeeva Reddi :—మనకువున్న అడ్డంకులు తీరిపోగానే పనిప్రారంభిచడానికి వీలుగా ఈ డబ్బును గతసంవత్సరం, మళ్లీ యీ సంవత్సరం మంజూరు చేస్తూవచ్చాము. C. V. K. రావుగారు క్రిందటి సంవత్సరం కూడా శాసనసభాసభ్యులే. మైసూరు ప్రభుత్వంతో అగ్రిమెంటు పూర్తి కాగానే పనిచేసుకునేందుకు వీలుగా ఈ allotment జరిగింది. అగ్రిమెంటుపూర్తి అయితేనేగాని పనిప్రారంభించ డానికి వీలులేదు.

Sri P. Ranga Reddi:— ఏయేఅంశాలపై వారితో సంప్రదించ వలసిన అవసరంవుంది? ఇదివరలో ఏయేవిషయాల మీద సంప్రదింపులు జరిగాయి ? వాటి పర్యవసానం ఏమిటి ?

The Hon. Sri N. Sanjeeva Reddi :— ఆంధ్ర ప్రభుత్వానికి మైసూరు ప్రభుత్వానికి నీటిపంపకం విషయంలో అగ్రిమెంటు జరగవలసి వున్నది. అటువైపు మునిగిపోయే భూమికి compensation విషయం కూడావుంది. క్రొత్త సమస్యలు కూడా బయలుదేరాయి

Sri T. Potharaju:— ఈ ప్రాజెక్టుల విషయంలో ప్రజలనుంచి ఆందోళన వచ్చినప్పుడు ఒక పునాదిరాయి వెయ్యడము, తర్వాత పని ఏమీజరగక అది అట్లాగే వుండిపోవడము, జరుగుతూవుంటుంది. విజయ వాడలో ఈ మధ్యరోడ్డు బ్రిడ్జిరెగ్యులేటరుకు కూడా పునాదిరాయి వేశారుకాని ఇంతవరకు material ఏమీచేర్చ బడలేదు. ఇది కూడా అట్లాగేవుండి పోతుందేమో నని ప్రజలు అభిప్రాయపడుతున్నారు. ఆవిధంగా వారు అభిప్రాయపడడానికి సావకాశంలేకుండా చూస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :—పోతురాజుగారి కళ్లకు అన్నీ అట్లాగే కనిపిస్తాయి. రాష్ట్రంలో పునాదిరాయివేసి పనిచెయ్యకుండా

వున్న ప్రాజెక్టుఒక్కటైనా చూపండి. ఈప్రాజెక్టుకు పునాదిరాయి సంజీవ రెడ్డిగారుగాని ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంగాని పూనుకుని వేసిందికాదు.

Sri T. Nagi Reddi :—వెనకటి ప్రభుత్వంకూడా సంజీవ రెడ్డిగారిదే, ఎందుచేతనంటే వారు కాంగ్రెస్ అధ్యక్షులుగాను, మంత్రివర్గంలోకూడ ఒక భాగస్వాములుగాను వున్నారు. ఈ ప్రాజెక్టు ప్రారంభించక పూర్వం పునాదిరాయి వెయ్యబడిందని చెప్పారు. పని ప్రారంభించడం ఎప్పుడో తెలియక ముందు, ఎన్నికలు జరిగేముందు పునాదిరాయి వేస్తూవుంటారు. యెన్నికల కోసం పునాదిరాళ్లు వెయ్యడం తగ్గించుకుని తక్షణమే పని అయ్యే సందర్భంలోనే పునాదిరాళ్లు వేస్తామని చెపుతారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :—I refuse to answer.

Sri Pillalamarri Venkateswarlu :—మైసూరు ప్రభుత్వంతో మద్రాసు ప్రభుత్వంగాని ఈప్రభుత్వంగాని ఎన్ని తడవలు సంప్రదింపులు జరిపారో, వాటి పర్యవసానంగా అగ్రిమెంటు కాకుండావున్న తీవ్రమైన భేదాభిప్రాయమేమిటో తెలియజేస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—సంప్రదింపులను గురించి ఏమీ చెప్పదలచుకోలేదు.

Sri T. Nagi Reddi:—పోనీ, ఎన్నితడవలు సంప్రదింపులు జరి పారో చెపుతారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—Notice please.

Sri G. Nagabhushanam :—Has the Bhairavanitippa project been included in the Five-year Plan ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—Yes, Sir.

Sri K. Malakondayya:—అయ్యా, ఈప్రాజెక్టుకు సంబంధించిన కార్యకలాపాలకు ఏమాత్రం డబ్బు ఖర్చయింది ? మైసూరు స్టేటులో గాని ఆంధ్రరాష్ట్రంలోగాని ఎన్నివేలయకరాలు సాగులోకి వస్తుందో సెలవిస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—8000 యకరాలు సాగవు తుంది. ఎంతఖర్చయిందో నాకు తెలియదు. నాకు తెలిసివున్నంతవరకు పని ప్రారంభించబడలేదు. కాబట్టి ఒక్క అణాకూడా ఖర్చవలేదు.

Sri N. Sivarami Reddi :—ఈ ప్రాజెక్టువల్ల ఏయే తాలూకా ల్లో ఎంతెంతభూమికి నీటిపారుదల సౌకర్యం కలుగుతుంది ?

25th February 1954]

The Hon. Sri N. Sanjeeva Reddi:—రాయదుర్గం, కల్యాణ దుర్గం తాలూకాలలో కొన్నివేల యకరాలభూమికి నీరు సప్లైఅవుతుంది.

Sri T. Nagi Reddi:— ఈ ప్రాజెక్టు నిర్వహణకు స్పెషల్ డివిజన్ ఏదైనా యేర్పాటుచేశారా లేక మైసూరుతో అగ్రిమెంటు అయినతర్వాత ఏర్పరచదలచారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:— అగ్రిమెంటు వచ్చిన తర్వాతనే యేర్పాటుచేస్తాము.

*Tank-bed lands in Penubarthi*

*152 Q—Sri K. Krishna Rao:—Will the Hon. the Minister for Land Revenue be pleased to state—

(a) whether the lands in Thuticheruvu tank-bed in Penubarthi, Nellore taluk were being cultivated by the landless poor of the village for the past 9 years prior to 1951;

(b) whether after 9 years of continuous cultivation, the very lands in clause (a) were stated by the Land Revenue authorities of the taluk, to be objectionable in 1952 for cultivation, and

(c) the reasons for asking those agricultural labourers not to cultivate them ?

The Hon. Sri K. Koti Reddi:—Clause (a) The tank-bed lands were under unauthorised cultivation from fasli 1354.

Clause (b) and (c): It is reported that the cultivation was not continuous. As the assignment of the lands in this tank-bed was prohibited as early as in 1921, the encroachments were treated as objectionable every year and penalties were being levied.

Sri T. Nagi Reddi:— ప్రశ్నలో మూడవభాగానికి జవాబు చెప్పలేదేమి ?

The Hon. Sri K. Koti Reddi:—(b)&(c)అనిచెప్పాను. అదే.

Sri C. V. K. Rao:— మంత్రిగారు సమాధానం చెప్పతూ 1951 కి 9 సంవత్సరాల పూర్వంనుంచి, అంటే 13 సంవత్సరాలనుంచి పేదవైతాంగం ఆ భూమిని దున్నుతున్నారు అని అంగీకరించారు. కనుక ప్రభుత్వం ఇప్పటికైనా బంజరు భూములను బీదలకు పంచుతాము అని

[25th February 1954

చెబుతున్న వాగ్దానాలను బట్టి 13 సంవత్సరాలనుంచి సాగుచేస్తున్న భూమిపై రైతులకు ఏమైనా హక్కు కలిగిస్తుందా ?

The Hon. Sri K. Koti Reddi:—గవర్నమెంటు చేసిన వాగ్దానాలను తప్పకుండా అమలుజరుపుతారు. అయితే objectionable lands వుండవచ్చు, tank-beds అందులో చేరినవే ఎందుచేతనంటే tank-beds breach కావచ్చు, వాటికి repair చేయమని కోరవచ్చు, repair చేయడానికి 4 సంవత్సరాలు, 10 సంవత్సరాలు కూడాపట్టవచ్చు. ఈలోగా objectionable కాదుఅంటే వీలుకాదు. మీరు చెప్పినదే అమలు జరిపితే ఇప్పుడు వుండే అవకాశం కూడా పేదలకు లేకుండా పోతుంది. దానివల్ల లాభంఏమీ లేదు.

Sri C. Pulla Reddi :—ప్రశ్నలో వచ్చిన చెరువు తెగిపోయిన చెరువా? చెరువు తెగివుంటే ఎందుకు objectionable అయినాయి?

The Hon. Sri K. Koti Reddi :— ఆ information ఇక్కడ లేదు. తెగిపోయినచెరువే అని అనుకుంటాను. కావలిస్తే తరువాత కోరితే తెప్పించి ఇస్తాను.

Sri V. Sri Krishna :—9 సంవత్సరాలనుంచి సాగుచేస్తున్నట్లు చెబుతూనేవున్నారు. పెనాల్టీలు వేస్తున్నప్పుడు, వారు సాగుచేయడంవల్ల ప్రభుత్వానికి నష్టం లేనప్పుడు ఇప్పటికైనా అవి objectionable కాదు అని నిర్ణయించి వారికి సాగు చేసుకునే అవకాశం ఇవ్వడానికి పూనుకుంటారా ప్రభుత్వం? ఇటువంటివి అనేకంగా వున్నందువల్ల సాగుదార్లకు ప్రత్యేక సౌకర్యం కలుగజేస్తుందా ప్రభుత్వం?

The Hon. Sri K. Koti Reddi :—Tank-bed lands విషయంలో general గా ఆక్షేపణకరమే. ఒకవిషయంలో మాత్రం ఆక్షేపణకరం కాకపోవచ్చు. ఒక irrigation project వల్ల tank beds breach కాకపోయినా సాగుచేయవచ్చును. Irrigation projects అనేవి 40, 50 సంవత్సరాలుగా contemplation లో వున్నాయి. ఏ దినానికి అవిపూర్తి అవుతాయో చెప్పలేము. అన్నీ చేస్తామనే అంటున్నాము, అనుకోండి. Future లో వచ్చేవారూ అంటారు. ఇప్పటికి ఆక్షేపణ లేదని త్రోసి పారేసి తిరిగి compensation ఇచ్చే పరిస్థితికన్న సంవత్సరం, సంవత్సరం lease కు ఇవ్వడం ఉపయోగకరం. ఈ విషయంలో మద్రాసుప్రభుత్వం వారు 1921 సంవత్సరంలో ఈభూములను prohibitory list లో వేశారు.

25th February 1954]

వాళ్ళు cultivation చేస్తున్నారు. Progressive penalty impose చేయవలసివస్తుంది.

Sri V. Rama Rao:—ఇది objectionble అని మనవిచేశారు. Breach అయినదా లేదా అనేవిషయం స్పష్టంగా చెప్పలేదు. దాని క్రింద ఏమైనా ఆయకట్టు ఉన్నదా? Objectionable అని records చూసి చెప్పినదేనా మంత్రిగారు, మరేమన్నాన?

The Hon. Sri K. Koti Reddi:—ప్రతి ఊరికి నేను inspection కు పోయిరావాలంటే సాధ్యంకాదు. 50 మంది మంత్రులు వున్నా చాలరు. కొంతవరకు records కూడా చూడవలసి వుంటుంది. Breached tank అవునా, కాదా అంటే ఇపుడు information లేదు. వేరే ప్రశ్న వేయండి.

Sri D. Lakshmayya:— బీదలు సాగు చేసుకునే భూములకే objection ఉంటుందా? అయితే కొన్ని గ్రామాల్లో చెరువులతో సహా రాజకీయ బాధితులనే పేరుతో కొందరికి ఇచ్చారు. దానికి ఏ objections లేదా?

The Hon. Sri K. Koti Reddi:-రాజకీయబాధితులైనా మరెవ్వరైనా ఆక్షేపణ అన్నది ఆక్షేపణే. Tank-bed lands అనబడేవి సాధారణముగా objectionable. ఇదివరలో ఏమిజరిగిందో నాకు తెలియదు.

Sri Pillalamarri Venkateswarlu:— Objectionable అని records బట్టి అయినప్పటికి, వెంటనే ప్రభుత్వం ఉపయోగంలోనికి తీసుకోవడంలేదు కనుక, రైతులు సాగులోనికితెచ్చి పంట పండిస్తున్నారు కనుక heavy penalties తీసివేయడానికి ప్రభుత్వం పూనుకుంటుందా? ప్రభుత్వం ఏమైనా పని ప్రారంభించినప్పుడు వాళ్ళను వెళ్ళగొట్టడం సహజమే. కాని ప్రస్తుతం penalties ఎక్కువగా లేకుండా చేయడానికి ఆలోచిస్తుందా?

The Hon. Sri K. Koti Reddi:—Breached tankకు నీటివసతిగల tank కు బేధంవుంటుంది ఒక సంవత్సరంలో చెరువులు నిండకుండా వుండవచ్చు. జొన్నమొదలైనవి అపుడు వేయవచ్చు. ఈ విషయంలో ఆక్షేపణలు వున్నాయి. షేటు అయిపోయి నీటిని నిలుపుదల చేయలేక

[25th February 1954

పోవడం. కొన్ని చెరువుల క్రిందగరువు భూములు వున్నాయి. నీళ్లు వాళ్లు పెట్టుకుంటున్నారు. కొన్నినాళ్లయిన తరువాత silt accumulate అవుతుంది. దానిని తీసివేయిస్తే మరల ఉపయోగపడుతుంది. ఒక సమయంలో ఆక్షేపణకరమైనది మరొకసమయంలో కాకపోవచ్చు.

Sri Pillalamarri Venkateswarlu :—ప్రశ్నకు సంబంధం లేని చరిత్రఅంతా చెప్పారు మంత్రిగారు. అభ్యంతరం లేనిచోట్ల రైతులు సాగుచేస్తున్న సందర్భంలో ఎక్కువ పెనాల్టీలు లేకుండా ఉత్తరువులు జారీ చేస్తారా ?

The Hon. Sri K. Koti Reddi :—ఆక్షేపణలేనిచో పెనాల్టీలు ఎప్పటికీ వేయరు. మొదట ఆక్షేపణలేని భూములు తరువాత ఆక్షేపణకరం కావచ్చు.

Sri K. Krishna Rao :— ఈ భూములన్నీకూడా పెనుబర్తి, నెల్లూరు తాలూకాలో వున్నాయి. దీనినిగురించి వివరాలు తెలుసుకొని ఆయన మాట్లాడం లేదని ఆయన ఒప్పుకుంటున్నారు. ఇది abandoned tank. తొమ్మిది సంవత్సరాలనుంచి యీ land ను సాగుచేస్తూవున్నారు. అప్పుడు లేనటువంటి objection యిప్పుడు ఎందుకు వచ్చింది ? కొందరు రైతులు పక్కనవున్న మాగాణి భూములలో మట్టితీసి ఈ tank-bed లో ఆమట్టి పోస్తున్నారు. దానికిలేని objection 9 సంవత్సరాలనుంచీ సాగుచేసుకునే పేదరైతుల విషయంలో objection ఎలా వుంటుంది ?

The Hon. Sri K. Koti Reddi :—Information లేదు. అయినప్పటికీ తెప్పిస్తాను. వూహించి చెబుతాను. చెఱువులు యిదివరకు పాడైనప్పటికి రిపేరు ఎస్టిమేట్లువుండి తరువాత అభివృద్ధికావచ్చు. అప్పుడు objection వుంటుంది. Information తెప్పించి చూచి చెబుతాను.

Sri G. Sivasankara Reddi:—కొన్ని ప్రదేశాల్లో నీటిముంపు కాని tank bed lands వున్నాయి. వాటిని బీదరైతులకు యివ్వడానికి objection వున్నదా ?

The Hon. Sri K. Koti Reddi:—నీటిమునుగుడు [illegible] వచ్చు. కొన్ని సంవత్సరాలు అయినతరువాత silt up అయి [illegible] p layers ఏర్పడినతరువాత ముంపురాకుండా చేయాల [illegible]

25th February 1954]

Silt up కాకుండా చేయడం రెండువిధాలు. ఒకటి silt clearance చేయడం. ఇది అంతగా తరచు సాధ్యమైన పనికాదు. రెండోది tank కట్టుఎత్తు హెచ్చుచేయవచ్చు. వీటిని పట్టాకుయిస్తే తరువాత గవర్నమెంటు compensation యివ్వవలసి వస్తుంది.

Sri T. Nagi Reddi:—On a point of order, Sir. ప్రత్యేక మైన చెఱువుకు సంబంధించిన ప్రశ్నయిది. దీనికి గౌరవనీయులైన మంత్రిగారుకొన్నిసూత్రాలుమట్టుకుమాకు చెబుతున్నారు. ఈసూత్రాలు నిన్న, మొన్న, గత మూడురోజులనుంచి చెబుతూవచ్చారు. ఈ tank, abandoned tank అవునా కాదా అన్న విషయానికి సంబంధించిన భోగట్టా తెప్పించకుండా సమాధానం చెప్ప గలరా? I can sympathise with him. I am sorry that he could not get the information. ఆ సమాధానం పంపించే ఆఫీసర్లు సరిగా పంపలేదు. దీనివల్ల వారికి నష్టం, మాకునష్టం. ఈ tank, abandoned tank అవునా కాదా? అన్నవిషయం మంత్రిగారు తెలుసుకోవలసిన అవసరం వుందనీ, Vague answers, principles చెప్పడం సరికాదనీ విజ్ఞప్తిచేస్తున్నాను.

Mr. Speaker:— పోని bit by bit అడగండి. answers చెబుతారు.

Sri T. Nagi Reddi:—ఇక్కడ వున్నటువంటిది abandoned tank అయినట్లయితే ఆ tank తిరిగి కట్టించడానికి రిపేరుచేయడానికి పట్టే కాలం లోగా అక్కడ సాగుచేస్తున్నటువంటి వ్యక్తులకు సాగుచేసు కొనుటకు అనుమతి యిస్తారా?

Mr. Speaker:—Please ask one question.

Sri T. Nagi Reddi:—Is it not an abandoned tank?

The Hon Sri K. Koti Reddi:— Honourable సభ్యుని information నేను నమ్ముతున్నాను.

Sri T. Nagi Reddi:—అట్లాఅయితే abandoned tank అని నమ్ముతున్నారు. కాబట్టి తిరిగి రిపేరుచేసి సాగుచేస్తున్న వ్యక్తులకు cultivation కు అనుమతి యిస్తారా?

The Hon, Sri K. Koti Reddi:—Yes.

Sri K. Krishna Rao :—ఇవి canal system లేకుండా వున్నప్పుడు బాగావుండే tank లు. ఇలాంటివి East Godavari, West Godavari, Krishna జిల్లాలలోకూడా canal system రాకపూర్వం మంచిస్థితిలోవుండేవి. అప్పుడుఆయకట్టువుండేది. Canal system రావడంవల్ల దాని క్రింద సాగవుతూ ఆయకట్టు 10 రెట్లు పెరిగినందువల్ల యీ tank లు absolutely abandoned tanks అయినాయి. అయినప్పటికీ రాజకీయ కక్షలు పెట్టుకొని హింసించడానికి యీవిధంగా జరుగుతున్నాయి.

The Hon. Sri K. Koti Reddi :—మీరు చెప్పిన సందర్భాలుంటే విచారించి తప్పకుండా చర్య తీసుకోడానికి సిద్ధంగా వున్నాము.

*Ex-servicemen Co-operative Motor Transport Societies.*

*153 Q.—Sri M. Veerabhadram :—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state—

(a) the number of Ex-servicemen Co-operative Motor Transport Societies in the State which implemented G. O. Ms. No. 3596, Development, dated 3rd August 1953;

(b) the number that have not implemented; and

(c) the reasons for non-implementation of the same?

The Hon. Sri D. Sanjivayya :—(a) The number of Co-operative Motor Transport Societies for Ex-Servicemen, which implemented the orders issued in G. O. Ms.No. 3596, Development, Dated 3-8-1953, is two. They are (i) the Guntur Co-operative Motor Transport Society and (ii) the Vijayawada Co-operative Motor Transport Society. In the case of the former, the elected Board of Directors has been functioning from 1—11—'53, while, in the case of the latter, the Sub-Collector, Vijayawada, has been continuing as President in accordance with the orders of the Government, as the Society has not yet repaid the loan to the Post-war Services Reconstruction Fund Committee.

(b) The Visakhapatnam Co-operative Motor Transport Society is the only Society which has not yet implemented the orders in G. O. Ms. No. 3596, Development, dated 3—8—1953.

(c) Though the Visakhapatnam Co-operative Motor Transport Society has discharged its dues to the Post-war

Services Reconstruction Fund Committee, it still owes a sum of Rs. 18,150/- to the Government of India towards the cost of M & B shed materials supplied to it. There has also been recently some labour trouble in the society. For these reasons, the nominated Board is continuing. The question of nominating the Personal Assistant to the Collector as ex-officio President in the place of the Collector, with reference to the orders in G. O. Ms. No. 3596, Development, dated 3—8—1953, is being examined by the Registrar of Co-operative Societies.

G. O. implement చేసిన Ex-servicemen Co-operative Motor Transport Societies రెండున్నవి. అవి (1) గుంటూరు Co-operative Motor Transport Society (2) విజయవాడ Co-operative Motor Transport Society. మొదటిది 1-11-53 నుంచి elected Board of Directors క్రింద పనిచేస్తుంది. రెండవది Government కు loan repay చేయనందున విజయవాడ సబ్ కలెక్టర్ ప్రెసిడెంటుషిప్ క్రింద పనిచేస్తుంది.

(b) విశాఖపట్టణము Co-operative Motor Transport Society మాత్రము G. O. ను ఇంప్లిమెంటు చేయలేదు.

(c) ఇంకా విశాఖపట్టణము సొసైటీ ఇండియా Government కు రు 18,150 అప్పువుంది. దానిలో లేబరు trouble కూడ వుంది. అందుక నే దానిలో nominated Board continue ఔతున్నది.

Sri R. Siddana Gowd:—What is the financial position of this society, and how many ex-servicemen are working in this society !

The Hon. Sri D. Sanjivayya:—Notice, Sir.

Sri M. Veerabhadram :—విశాఖపట్టణములోని సొసైటి 18 వేలు బాకి కట్టినసంగతి Registrar ప్రభుత్వానికి పంపారా ? ప్రభుత్వానికి తెలుసునా ?

The Hon. Sri D. Sanjivayya :—ప్రభుత్వానికి తెలియదు.

Sri T. Potharaju :—ఈ సొసైటీలలోని కండక్టర్లకు, డ్రైవర్లకు private owners వద్ద పనిచేసే కండక్టర్ల, డ్రైవర్ల జీతాలకంటె తక్కువని తెలుసా ?

The Hon. Sri D. Sanjivayya :—I would like to have notice.

Sri Vavilala Gopalakrishnaiah :—ఈ మోటారు ట్రాన్స్‌పోర్టు societies కాక వేరే ఏమైన societies ప్రభుత్వము ఏర్పరుస్తారా?

The Hon. Sri D. Sanjivayya :— అటువంటివి రాలేదు వస్తే చూస్తాము.

Sri Vavilala Gopalakrishnaiah:—సత్తెనపల్లినుంచిపంపినాము.

The Hon. Sri D. Sanjivayya :—చూస్తాము.

Sri S. Narayanappa :—Driver లకు కండక్టర్లకు First Aid Certificate వుండాలన్నారు. వీటివిషయములో డాక్టర్లకు చెల్లించు ఫీజు రద్దుచేయ పూనుకుంటారా ?

The Hon. Sri D. Sanjivayya:— రూల్సు అందరికి apply ఔతాయి. యీ విషయమై Transport మినిస్టర్ గారిని అడగాలి.

Sri C. V. K. Rao:--తూర్పుగోదావరిజిల్లా transport societyని register చేయమని మంత్రిగారిని కోరడమైంది. ఇప్పటివరకు register కాలేదు. దీని విషయము శ్రద్ధ తీసుకుంటారా ?

The Hon. Sri D. Sanjivayya:—ఉన్న సొసైటీలే సక్రమముగా పనిచేయడము లేదు.

Sri M. Veerabhadram :— Vizag society లో labour trouble ఎవరిమధ్యన వున్నది.

The Hon. Sri D. Sanjivayya:—యీ ప్రశ్నకు సమాధానము అప్పుడే చెప్పాను.

Sri K. Subba Reddi: ఉన్న సొసైటీలు సక్రమముగా పని చేయడము లేదన్నారు. అందుచేత register చేయడము మానివేస్తారా!

The Hon. Sri D. Sanjivayya:—అన్నీకాదు, కొన్నిమాత్రము సరిగ పనిచేయడము లేదు. కొత్తవికూడ రిజిష్టరుచేస్తాము.

Sri K. Malakondayya :—మంత్రిగారు ముందు సమాధానము చెప్పుతూ సొసైటీలు సరిగ పనిచేయడము లేదన్నారు. వారికేలా తెలుసు? మంత్రిగారికి వచ్చిన information ను బట్టి చెప్పుతున్నారా? లేక ఊహించి చెప్పుతున్నారా?

The Hon. Sri D. Sanjivayya :—స్వయంగా వెళ్ళి తనికీ [illegible] తెలుసు. కొన్నిరిపోర్టులవల్ల కూడా తెలిసి కొంటున్నాము.

25th February 1954]

*Road of Mogullur in Kanigiri.*

*154 Q.—Sri G. Yellamanda Reddi :—Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state—

(a) whether the Government have sent the estimates for the remaining portions of the road, i. e., from breaches III to VII upto Hanumanthapuram from Mogullur in Kanigiri taluk, Nellore district to the District Board, Nellore, for sanction ;

(b) if so, the action taken thereupon by the District Board ; and

(c) when the Government propose to start the work?

The Hon. Sri P. Thimma Reddi :—Thé road vests in the Nellore District Board. Government have no information on the points.

ఈ points పైన information లేదు.

*Sivayajama cultivation*

*156 Q:—Sri K. Krishna Rao :—Will the Hon. the Minister for Land Revenue be pleased to state—

(a) whether there is any rule or executive instruction that a minimum and irreducible amount of penalty should be levied on each item of objectionable cultivation of Sivayajama cultivation without regard to the land cultivated by persons ;

(b) whether there is any rule or executive instruction that a piece of land under Sivayajama cultivation which was treated as unobjectionable and assessed at normal rate for years, may at any subsequent fasli be classed as objectionable and subjected to heavy penalty ;

(c) the authorities authorized to impose penalties on objectionable cultivation in cases in clause (b) and whether such authorities are required to make an enquiry and obtain the explanation of the person ought to be penalized, before the penalty is levied ;

(d) whether the Government have issued instructions to Land Revenue authorities in Andhra districts, to impose heavy penalties on every piece of Sivayajama cultivation on landless poor-cultivating Sivayajama land for fasli 1362; and

(e) if there are any rules, executive instructions under clauses (a), (b) and (d) whether the Government will please place them on the table of the House ?

The Hon. Sri K. Koti Reddi :—(a) and (b) :—The answer is in the negative.

(c) The Collector or subject to his control the Tahsildar or the Deputy Tahsildar is authorised to levy penalties in respect of objectionable occupations of Government lands. The Tahsildar (or the Deputy Tahsildar) is required to inspect the objectionable encroachments in each case before passing orders concerning it. The encroacher should also be given prior notice under section 7 of the Land Encroachment Act, requiring him to show cause, before a fixed date, against the proposed levy of the penalty etc.

(d) The answer is in the negative.

(e) Does not arise.

Sri K. Krishna Rao :—నెల్లూరు తాలూకాలో కొన్ని గ్రామాలు - పెద్దచేకూరు మొదలగు వాటిలో ఒక అర్థసెంటు అయినప్పటికికూడ encroach ఐతే minimum రు 5 లు penalty విధించిన విషయము ప్రభుత్వానికి తెలుసా ?

The Hon. Sri K. Koti Reddi :—Government Rules అలా ఉన్నాయి.

Sri K. Rajagopala Rao:—యీ objections ఏమైనాసూత్రాల పైన ఆధారపడినవా ? లేక కేవలం తహశీల్ దార్ లాంటి అధికారుల ఆర్డర్ల మీాదనే జరుగు తున్నవా ?

The Hon. Sri K. Koti Reddi :—అన్ని సూత్రాలపైననే.

Sri P. Syamasundara Rao :—అధ్యక్షా, ఇప్పుడు యీగవర్నమెంటు భూములు బీదవాండ్లు చేసుకుంటుంటే విపరీతమైన, 18, 20 రెట్లు, పెనాల్టీ వేస్తున్నారు. రాజకీయ బాధితులు మాత్రము అట్టిపనిచేస్తే వారిపైన పెనాల్టీలు వేయడము లేదు. ప్రభుత్వము వారిపైన పెనాల్టీలు వేయకూడదని ఏమైన సలహాలు పంపిందా ? అలా అని అధికారులు చెబుతున్నారు కూడా ?

The Hon. Sri K. Koti Reddi :—అట్టి సలహాలేమి పంపలేదు.

25th February 1954]

Sri G. Joseph :—ప్రజలకుపయోగపడే చెఱువులను రాజకీయ బాధితులకు పట్టాలుఇచ్చారు. ఏ ఆటంకాలులేని భూములు పేద ప్రజలు సాగుచేసిన యెడల వారికి సెంటుకు 4,5 రూపాయలు, ఈరకంగా పెనాల్టీలు వేస్తున్నారు. ఇటువంటి పెనాల్టీలను రద్దుచేస్తారా ? ఈ రాజకీయ బాధితులకు ఇచ్చినటువంటి భూములకు పట్టాలు రద్దుచేసే విషయము ప్రభుత్వము ఏమైన ఆలోచిస్తుందా.

The Hon. Sri K. Koti Reddi:—ఇదిచాలా జనరల్ question. దీనికి సమాధనం చెప్పాలంటే చాలా ఆలస్యమౌతుంది. ప్రత్యేకప్రశ్న వేసినట్లైతే జవాబు జెపుతాను.

Sri T. N. Venkatasubba Reddi :—The Hon. Minister said in his reply that there were no instructions issued to the land revenue authorities in Andhra districts. But, may I bring to the notice of the Government, that whether there are instructions issued or no instructions, the penalties and decisions taken by the local authorities vary from time to time regarding Sivayajama cultivation, and especially in the dry areas of the State. So, may I request that a half-hour debate be allowed on this subject, as it is a matter affecting the ryots in the dry areas.

Mr. Speaker :—If the House is agreeable to have it this evening I have no objection.

Sri T. Nagi Reddi :—To-day is a non-official day.

Mr. Speaker :—I have no objection to have it to-day.

Sri T. Nagi Reddi :—If the half-hour debate is to be taken to-day, it means, it can be done only at the end of to-day's business.

మనం non-official business ను 5 గంటలకు పూర్తిచేస్తే, తరువాత అరగంటసేపు extend చేసి, ఈ debateనుగురించి మాట్లాడవచ్చును. ఆవిధంగా చేయగలిగితే మంచిది.

Mr. Speaker :—Then, I shall allow ten minutes more for supplementary questions.

Sri M. Hanumantha Rao :—అధ్యక్షా, ఇప్పుడు మనముందు ఉన్నటువంటి Non-official resolutions లో మొట్ట మొదటిది బంజరు

భూములకు సంబంధించినటువంటిది. దానితోపాటు దీన్నికూడ అప్పుడు చర్చించుకోవచ్చునని మీకు గుర్తుకు తెస్తున్నాను.

Mr. Speaker:—అది మరీమంచిది.

*Estates Abolition Act.*

* 158 Q:—Sri G. Yellamanda Reddi:—Will the Hon. the Minister for Land Revenue be pleased to state—

(a) Whether the Government have taken over all the estates in the State under the Estates Abolition Act;

(b) if not, why;

(c) the Estates not yet taken over; and

(d) how long it will take for the Government to take over these Estates?

The Hon. Sri K. Koti Reddi:—

(a) The Government have not yet taken over all the estates in the State under the Estates Abolition Act.

(b) & (c) The number of estates not yet taken over is 178 as shown below:

| | |
|---|---|
| Zamin Estates | 50 |
| Under-tenures | 50 |
| Inam Estates | 78 |
| Total. | 178 |

These estates could not be taken over so far as they are covered by the injunction orders of the High Court or the Appeals filed before the Estates Abolition Tribunals.

(d) The exact dates when all these estates will be taken over cannot be stated. They will be taken over as and when the stay orders of the High Court are vacated or the appeals filed before the Estates Abolition Tribunals are disposed of as the case may be.

Sri K. Govinda Rao:—High Court లో writs అన్నీ కూడ vacate అయిపోయిన 4 నెలలు తరువాతకూడ పర్లాకిమిడి estate ను తీసుకోవడంలో ఎందుకు ఆలస్యం జరుగుతున్నది. ఈ ఆలస్యం జమీందార్లకు కొంత సౌకర్యాలను చేకూర్చుటానికా, లేకపోతే మరేమి [illegible] చెప్పగలరా!

25th February 1954]

The Hon. Sri K. Koti Reddi:—పర్లాకిమిడి విషయంలో notification చేయమని అప్పుడే పంపించాము. బహుశా త్వరలోనే వస్తుంది.

Sri L. Lakshmana Das :—ఈ ఎస్టేట్లను స్వాధీనం చేసుకోవడంలో ఆ Act లో ఉన్న defect వల్ల ఇంతవరకు ఆలస్యం జరుగుతున్నది. కనుక ఆ Act ను సవరించడానికి ప్రభుత్వము ప్రయత్నం చేస్తుందా?

The Hon. Sri K. Koti Reddi:—ఏ defect వల్ల జరిగింది? అసలు High court వారికి ఏదో అధికారమున్నది. దానిక్రింద writs మొట్టమొదట allow చేశారు. అక్కడ కొంతమట్టుకు ఆలస్యం అయింది. ఏ defect అని చెప్పితే, దానికి answer చెప్పతాను. జనరల్‌గా చెప్పటకు సాధ్యంగాదు.

Sri S. Narayanappa:—ఈ Estates Tribunal వారు తీర్మానం చేసిన తరువాత కూడ, ఆ ప్రాంతములో ఉన్నటువంటి భూస్వాములు హైకోర్టుకు వెళ్ళి దావాలువేసి ఆ ప్రాంతాలలో రైతులకు చాలాకష్ట పరిస్థితులు కల్గిస్తున్నారు. కనుక ప్రభుత్వము ఈ విషయములో వెంటనే తగినటువంటి చర్య తీసుకొంటుందా?

The Hon. Sri K. Koti Reddi:—High Court కు ఉండే అధికారాన్ని legislation వల్ల ఏవిధంగా prevent చేయగలమో నేను చెప్పజాలను. అనేక Acts లో ఇది courts కు పోకూడదు అని వేసినాకూడ High Courts కు వెళ్లాయి. దానిపైన ఒక్కొక్కసారి writs issue చేస్తారు. అందువల్ల High Court కు పోకుండా చేయాలంటే writs లో ఉండేటటువంటి ప్రాధాన్యతనుబట్టి ఆ provisions ప్రకారము ఒక్కొక్కసారి వాటిని నిలుపుదలచేస్తారనేది వాస్తవమే. అంతేగాని గవర్నమెంటుది ఏమీ లేదు.

Sri M. Veerabhadram:—కడపజిల్లా రాజంపేట తాలూకాలోని మహారాజపురం estate ను ఎందుకు స్వాధీనం చేసుకోలేదు?

Sri T. Nagi Reddi:—దానిని ఎప్పుడు స్వాధీనం చేసుకొంటారో చెప్పమంటున్నాను.

The Hon. Sri K. Koti Reddi:—ఇప్పుడు అక్కడ ఉండేటటువంటిది ఇనాముఎస్టేటు, అందులో కుడివరము, మేలువరము అంతా, ఆ

[25th February 1954

ప్రొప్రయిటర్‌లో ఉందని ఆ Tribunal Settlement Officer చెప్పారు. దానిపైన appeal లేదు. అందువల్ల ఆ రైతులకుకూడ బాధలేదు అనుకొంటాను. బహుశ వారు దానివల్ల లాభమే పొందుతున్నారేమో గాని, వాళ్ళ ఇష్టానుసారంగా ఉపయోగించుకొంటున్నారు. మీరు కావలసివస్తే విచారించుకోండి.

Sri G. Yellamanda Reddi :—అధ్యక్షా, ఇంతకుముందుకూడా నాప్రశ్నలపై, నాకు సప్లమెంటరీ ప్రశ్నవేయడానికి అవకాశము యివ్వలేదు. ఇప్పుడు వేసినప్రశ్న చాలా ముఖ్యమైనది దీనిపై నాకు సప్లిమెంటరీ ప్రశ్నకు అవకాశముయివ్వాలి ప్రశ్నవేసినవారికి తప్పనిసరిగా, సప్లిమెంటరీప్రశ్న వేయడానికి అవకాశము కల్పించటము యింతవరకు అసెంబ్లి సాంప్రదాయము. కాని, మీరు యీ విషయమై గమనించటము లేదు. ఇప్పుడు 11-50 అయింది. నేను ఒక్కప్రశ్న వేయడానికి అవకాశముందా ?

Sri Pillalamarri Venkateswarlu:-- అధ్యక్షా, మీరు supplementary questions బాగానే allow చేస్తున్నారు. కాని ప్రశ్న ఎవరువేస్తారో, వారికి ముందుఅవకాశం ఇవ్వడం సాంప్రదాయసిద్ధంగాయున్నది. దాన్ని పాటిస్తే చిక్కులుఉండవు.

Mr. Speaker:—అట్లాగేచేస్తాము.

*Tour of the Andhra State Officials.*

*159 Q.—Sri C. V. K. Rao:—Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the names and designations of Andhra State Officials of provincial rank that toured the Andhra districts since the formation of the State;

(b) the places that they have visited and the purpose for which they visited;

(c) the money that was spent for their tours; and

(d) whether they have circulated their tour programmes to the members of the Andhra Legislature, while visiting their areas?

The Hon. Sri T. Prakasam :—(a), (b), (c), and (d) :— The information required is not readily available and Government consider that the time and labour involved in collecting the same is not commensurate with the public purpose to be served thereby.

Sri C. V. K. Rao:— అధ్యక్షా, ప్రధాన మంత్రిగారి దృష్టికి గూడా, రాలేనటువంటి పరిస్థితులలో ఉన్న ఉద్యోగులు ప్రయాణాలు చేస్తున్నారన్నమాట. ఈ అభిప్రాయం శాసనసభ్యులకు వుండేమాట అయితే, సరియైనదా, కాదా? అని అడుగుతున్నాను.

The Hon. Sri T. Prakasam :— ఈ మోస్తరుగా general question వేసే దాని కన్నఎవరు ఎక్కడఏవిధంగా tour చేస్తున్నారో, ఆ విధంగా అడిగితే, దానికి జవాబుచెప్పటానికి సాధ్యమవుతుందిగాని, ఈవిధంగా అడిగితే, జవాబుచెప్పటానికి ప్రభుత్వానికి వీలువుతుందేమో చెప్పండి.

Sri C. V. K. Rao :—I am putting another supplementary question, Sir. ముఖ్యంగా నాquestionలో (d) భాగానికి వుద్యోగులు ప్రయాణము చేసినప్పుడు ఆయాప్రాంతాలలోని శాసన సభ్యులకు వారి tour programmes అంద జేయబడలేదు. అక్కడి శాసనసభ్యులకు కూడా వారి tour programmes తెలియడములేదు. ఆ వుద్యోగులుప్రయాణముచేసి వెళ్లినతరువాతనే, ఆ tour programmes సంగతి తెలుస్తున్నది అట్టి పరిస్థితులలో ఆ State Officials తెలియజేసే పరిస్థితులుకూడాలేవు. అంతేకాకుండా మంత్రులు ప్రయాణాలు చేసే ముందు ఆ జిల్లాలోవుండే State Officials అక్కడవున్న శాసనసభ్యులకు తెలియజేసే విధానము అమలులో పెట్టుతారా? దీనివల్ల యిబ్బందులు తగ్గుతవనే సంగతి గుర్తిస్తారా!

The Hon. Sri T. Prakasam :—ఇబ్బందులు ఉండటము సహజమే. అందువల్ల కొంతకష్టము కలిగితే కలగవచ్చు. ప్రయాణము విషయమై అప్పటికప్పుడు అడిగితే చెబుతాను.

Sri V. Sri Krishna :—మంత్రులుగాని, రాష్ట్రప్రభుత్వోద్యోగులు గాని పర్యటన చేసేసందర్భములో వారికి అవసరమైన departments లో అవసర మున్నంతవరకు ఆఫీసర్లే కాకుండా మొత్తము staff అంతా గూడా పై అధికార్లదగ్గర గుంజీలు తీయడం అనవసరము కాబట్టి, అవ

సరియైన staff ను మాత్రమే వారు హాజరయ్యేలా చూస్తారా ? మంత్రుల యొక్క Heads of Departments యొక్క పర్యటనవల్ల జిల్లాఅధికార్ల fortnightly programmes upset అవుతవనే అభిప్రాయం వారిలో వుందికాబట్టి అనవసరంగా disturb చేయకుండా వుండడానికి ప్రభుత్వము చర్య తీసుకుంటుందా.

The Hon. Sri T. Prakasam :— ఎన్నో ప్రశ్నలు వచ్చాయి ఎన్నో జవాబులు కూడా చెబుతున్నాము. దీనికి ముఖ్యంగా ఎవరెవరు ఆ యా పంథాలో ఉన్నారో కనుక్కోటానికి ప్రయత్నంచేస్తాను.

*Nandikonda Project*

*160 Q.—Sri M. Lakshmanaswamy :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Government have completed the detailed investigation of the Nandikonda Project;

(b) whether the Government have recommended to include for execution in the second stage of the first Five-Year Plan, in the year 1954-55;

(c) the height of the proposed dam at Nandikonda; and

(d) the estimated cost of the Nandikonda dam?

The Hon. Sri N. Sanjeeva Reddi:—(a) It is presumed that the hon. Member is referring to the investigation of the right side canal of the proposed dam at Nandikonda. If so, the answer is in the affirmative.

(b) The answer is in the affirmative.

(c) The height of the dam recommended by the Khosla Committee is 590 ft. F. R. L.

(d) Rs. 35·03 crores. The details are being worked out by the Chief Engineer (Irrigation) in consultation with the Government of Hyderabad.

అధ్యక్షా, supplementary questions వేసేటప్పుడు information gather చేయాలనే వుద్దేశ్యముతో వేస్తే information యివ్వటానికి ప్రభుత్వము సిద్ధముగా వున్నది. అట్లాగాకుండా, insinuate చేద్దామనే motive తో supplementary ప్రశ్నలు వేస్తే, information యివ్వటానికి ప్రభుత్వము తయారుగావుండదని సభ్యులకు వినయపూర్వకముగా [illegible]న్నాను.

25th February 1954]

Sri M. Hanumantha Rao :—నందికొండ ప్రాజెక్టు డాము ఎత్తు ఖోస్లకమిటీ recommend చేసిన ప్రకారము 590 అడుగులని చెప్పారు. ఈమధ్య హైదరాబాదు ప్రభుత్వ యింజనీర్లు, ఆంధ్ర ప్రభుత్వ యింజనీర్లు సమావేశమై చర్చించి ఉమ్మడిగా 566 అడుగులు ఎత్తువరకు మాత్రమే డామువుండాలని అంగీకరించినట్లుగా పత్రికలలో వార్తలు వెలువడ్డవి. ఆ విషయము వాస్తవమా? అయితే, ప్రభుత్వముయొక్క అభిప్రాయమేమి?

The Hon. Sri N. Sanjeeva Reddi :— గవర్నమెంటు వరకు ఆ రిపోర్టు యింకను రాలేదు. మన ఇంజనీర్లు, హైదరాబాదు యింజనీర్ల మధ్యచర్చలు జరుగుతున్నవి. మన Chief Engineer గారు హైదరాబాదుకు వెళ్లారు. ఖోస్లకమిటీవారు recommend చేసినట్లుగా 590 అడుగులవరకు డాముఎత్తు వుంటుందనే యీ ప్రభుత్వమువారి అభిప్రాయము. గవర్నమెంటు level కు ఆ రిపోర్టువచ్చినప్పుడు, దాన్ని పరిశీలించి, యీ ప్రభుత్వము యొక్క అభిప్రాయమును అఖిలభారత ప్రభుత్వానికి తెలియజేస్తాము.

Sri K. Ramaiah Chowdary: — అధ్యక్షా, ఖోస్లాకమిటీ నివేదిక ప్రకారముకాకుండా, యిప్పుడునందికొండ కాలవ విషయములో జరిగే టటువంటి పరిశీలనవల్ల మా నెల్లూరుజిల్లాలోని మెట్టతాలూకాలకు నీరు పారుదలకాదని ప్రజలకు పత్రికల ద్వారా తెలిసింది. అటువంటప్పుడు మా నెల్లూరు జిల్లాలోని మెట్టతాలూకాలకుగూడా యీ కాలవ ద్వారా నీటి సౌకర్యములు కలిగేటట్టుగాను, ప్రజలకు వుపయోగపడే టట్లుగాను ప్రయత్నిస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi :—ఎంతోడబ్బు ఖర్చు చేసి ప్రాజెక్టు కట్టుకొన్న తరువాత, ఆ ప్రాజెక్టువల్ల నీటిని ఎంత వరకు ఉపయోగపరచుకో గలుగుతామో, అంతవరకు వుపయోగించుకొనుటకు ప్రయత్నిస్తాము. మెట్టప్రదేశాలకే కాకుండా యింకను హెచ్చు ప్రాంతాలకు యిచ్చేటట్లు చూస్తాము. మన డబ్బుతో కట్టుకున్న ప్రాజెక్టుయొక్క నీటిని సంపూర్ణముగా వుపయోగించుకోటానికి వీలుంటుంది. గనుక, దీని విషయములో ప్రాజెక్టుయొక్క నీటి వనరు మనకు పూర్తిగా కలుగ జేస్తామని హామీ యిస్తున్నాను.

Sri T. N. Venkatasubba Reddi:—Sir, the Hon. Minister told us that they are awaiting the report on the whole

[25th February 1954

issue from our Chief Engineer (Irrigation) after the details are worked out in consultation with the Government of Hyderabad. May I request the Government to place before this House the summary of the conclusions so reached and the reasons therefor, so that there may not be any misunderstanding.

The Hon. Sri N. Sanjeeva Reddi :—ఇందులో రహస్యమేమి లేదండి. ఇంజనీర్ల వద్దనుంచి వచ్చే interim report ను, ప్రభుత్వము పరిశీలించిన తరువాత, ప్రభుత్వము final report ను ఈశాసనసభ table మీద పెట్టుతాము. ఇదంత ఆలోచించి చేయువలసివుపని. ఇందులో రహస్యము యేమియు లేదు. ప్రభుత్వము పూర్తిగా పరిశీలించి final report తయారు అయినప్పుడు సభ్యులకందరికి తప్పకుండా తెలియజేస్తాను.

Sri C. Subbarayudu :—(1) ఈ ఖోస్లాకమిటీ రిపోర్టు ఆంధ్ర దేశములో ఒకే ప్రాంతానికి సహాయపడడమువల్ల, మరొక ప్రాంతములో ప్రజలు క్షామంచేత బాధపడుతారు కాబట్టి, యీవిషయము, యీ ప్రాజెక్టువల్ల వచ్చేనీటివనరు ఒకే ప్రాంతానికి ఉపయోగపడేటట్లుగావుంది అనేవిషయము ప్రభుత్వానికి తెలుసునా ?

(2) ఆ రిపోర్టు వచ్చినతరువాత, ఆంధ్రప్రభుత్వము యేమైనా ఆలోచిస్తుందా! Central Government కు గాని, Planning Commission కు గాని ప్రభుత్వము మనవి చేసింది ఏమిటో చెబుతారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :-సభ్యుడు వేసినది చాలా పెద్దప్రశ్న అనుకోండి. ప్రభుత్వము అన్నిప్రాంతాల గురించి కూడా ఆలోచిస్తున్నది. ఒకే ప్రాంతం క్షామంతో గురికావలసిన అవసరంలేదు. ఒక ప్రాంతంలో ప్రాజెక్టు కడితే, మరొక ప్రాంతంలో ప్రాజెక్టు కట్టకూడదు అనే వుద్దేశ్యము ప్రభుత్వానికి లేదు. ఆరిపోర్టు రాగానే అఖిల భారత ప్రభుత్వానికి సరియైన సిఫార్సు చేస్తుంది. ప్రజలు యీ విషయములో యేమాత్రము అనుమానము పెట్టుకో నవసరంలేదని చెబుతున్నాను.

Sri S. Narayanappa:—ఈ నందికొండ ప్రాజెక్టువస్తే, సిద్ధేశ్వరం ప్రాజెక్టు వెనుకబడి పోతుందని రాయలసీమ వారిలో చాలమందికి ఒక అభిప్రాయము, అనుమానాలు కలిగినవి. ప్రభుత్వము యీ ప్రాజెక్టును [illegible]ంగానైనా వెనుకబడకుండా ప్రయత్నిస్తారా ?

మరియు నాగార్జునకొండలో వుండే బౌద్ధస్తూపాలు మునిగిపోతాయని పత్రికలలో వార్తలు వెలువడ్డవి. ఈవిషయములో చీఫ్ యింజనీరుగూడా చెప్పారు ఈ విషయములో కేంద్రప్రభుత్వంవారు యీ ప్రభుత్వమునకు యేమైనా తెలియజేశారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—పత్రికలలో చదువుకున్న వార్తలుతప్ప నాకు ఏవిధమైన representations న్నూ రాలేదు. ఎవరు కూడ నావద్దకు వచ్చిచెప్పుకోనలేదు. సిద్ధేశ్వరము ప్రాజెక్టురాదనే అభిప్రాయము సరియైనదికాదు. హైదరాబాదు ప్రభుత్వమునకు, మన ప్రభుత్వమునకు సిద్ధేశ్వరము ప్రాజెక్టు కట్టడానికి ఏవిధమైన ఆక్షేపణలు లేవు ఈ విషయములో ప్రజలకు ఎవ్విధమైన అనుమానాలు వుండనవసరము లేదని మనవిచేస్తున్నాను.

Sri V. Sri Krishna :- ఈనందికొండ ప్రాజెక్టు విషయంలో చర్చలు జరిపిన మీాదట మన engineers పులిచింతల ప్రాజెక్టు ఆయకట్టు చేర్చకూడదని, ఖోస్లా కమిటీతో దానిని exclude చేయాలని అభిప్రాయాలు యివ్వడం జరిగింది. పులిచింతల ప్రాజెక్టుకు సంబంధించిన భూములనుగూడా నందికొండఆయకట్టులో చేర్పించే యేర్పాటుచేస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi:-నేను ఆరిపోర్టు చదివాను కాని, యీ ప్రశ్నకు సమాధానము చెప్పలేను. పులిచింతల ప్రాజెక్టు areas కొన్ని, దీనికి సంబంధించిన areas లో వున్నాయి కనుక, maximum benefit ప్రత్యేక ప్రాజెక్టునుండి పొందడానికి కృషిచేస్తాము.

Sri V. Rama Rao :-ఈడాము ఎడమవైపు కాలువ క్రింద Hyderabad State ప్రాంతంలోనే కాకుండా మనప్రాంతంలో కూడ సాగులోకివచ్చే నందిగామ తాలూకా వగైరా ప్రాంతాల విషయంలో కూడ detailed investigation యేమైనా సాగిందా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—Dam ఎత్తు తగ్గిస్తే, water వినియోగింపు తగ్గుతుంది. అందువల్ల రెండు లక్షల యెకరాల సాగులో తగ్గిపోతుంది. కాబట్టి ఖోస్లా కమిటీ చెప్పినట్లు మనప్రభుత్వము ఎత్తువుండాలనే వాదించింది. అందుకు ఎత్తు హెచ్చించినట్లైతే పదికోట్ల రూపాయలు ఖర్చు హెచ్చుఅవుతుంది, ఎందుకు యింత ఖర్చు పెట్టాలని వారికి అభిప్రాయం కల్గింది. ఈవిషయం గురించి అఖిలభారత ప్రభుత్వము మనకు తెలియజేశారు. ఖోస్లా కమిటీ చెప్పిన ఎత్తు కట్టడానికి మనము

కృషిచేయాలి కాని తగ్గించడానికి వీలులేదని మన ప్రభుత్వం వాదించింది. Planning Commission నుంచి వారి report మనకు 11-12-1953 న వచ్చింది కనుక దానిని గురించి అవకాశాలువుంటే final report మీాద మనం మనఅభిప్రాయము ముఖ్యంగా తెలియజేయాలను కొంటున్నాము.

Sri S. Kasi Reddi :— అధ్యక్షా, 590 అడుగులు dam ఎత్తు వున్నప్పుడు, కుడికాలువవల్ల యెంత వుపయోగం వుంటుంది? ఇప్పుడు కాలువలు పొగుడుదలవల్ల ఆయకట్టు అడ్డుగావుందన్నారు. Dam యెత్తు యెంతవుండాలి? ఇదేమైనా మీాకు తెలుసా?

The Hon. Sri N. Sanjeeva Reddi:—ఇది చాల పెద్దప్రశ్న. దానికి statistics వున్నవి. 590 అడుగుల యెత్తు డాముకు యెన్నో లక్షలకొద్ది యెకరాలు సాగుబడిఅవుతుంది. 560 అడుగులు యెత్తుకు తగ్గిస్తే, నీటిపారుదల తగ్గవచ్చు. మీాకు information తప్పకుండా కావాలంటే ఆ information తెప్పించి చెప్తాను. ఇప్పుడు నావద్దవున్న files లో ఆ information లేదు కనుక, వేరేప్రశ్నవేస్తే జవాబు తప్పకుండా చెప్తాను.

Sri M. Narayanaswamy:—ఈప్రశ్న అనేకసార్లు వేసినప్పటికి కూడా ఖచ్చితమైన జవాబురాలేదు. ఇంకా పరిశీలనలు జరుగుతున్నవనే చెప్తూవచ్చారు. ఈసారియైనను ఒక ఖచ్చితమైన గడువులోపల, దానికి నిర్దుష్టమైన జవాబు యిస్తారండి?

The Hon. Sri N. Sanjeeva Reddi:—అది అంత సులభమైన పనికాదండి. ఆంధ్ర, హైదరాబాదు Chief Engineers 21, 22 తేదీలలో Hyderabad లో సమావేశమైనారు. వారి report యింతలోపలనే వస్తుందని నేను చెప్పలేను, చెప్తేకూడా అది అంత accurate information కాదు.

Sri T. Potha Raju :—ఈ నందికొండ ప్రాజెక్టుకు సంబంధించి వంతవరకు ఆంధ్రప్రభుత్వముయొక్క అభిప్రాయాలను యిచ్చినందులకు సంతోషించవలసినదే అనిచెప్తున్నాను. అయితే యీా project ను sabotage చేయడానికి మద్రాసు ప్రభుత్వం, కేంద్రప్రభుత్వం మీాద [illegible]కమైన ఒత్తిడి తీసుకువస్తోన్నదని వదంతిగావుంది. మద్రాసు [illegible], శ్రీ సి. రాజగోపాలాచారిగారు అడ్డం తగుల్తు

న్నారని తెలుస్తున్నది. అలాంటిఅభిప్రాయాలు ప్రజలలోవున్నవి. అలాంటిది జరుగుతున్నదా ?

(No answer).

Sri K. Venkayya:---అధ్యక్షా, దానిని పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి రాష్ట్ర ప్రభుత్వమునుంచి సమాధానం రాకపోవటం, ఇక్కడ estimates పూర్తిచేసి, అక్కడకు పంపించకపోవడం, అడ్డుగావుండటము జరిగిందని నాకు తెలిసినది. ఈ estimates త్వరలో పూర్తిచేసి, కేంద్ర ప్రభుత్వానికి పంపించమని కోరుతూ కొంతమంది మిత్రులు చెప్పారు. కనుక దీనిని దృష్టిలో పెట్టుకొని దానిని వెంటనే కేంద్రప్రభుత్వానికి పంపించడానికి యీ ప్రభుత్వం చర్య తీసుకొంటుందా?

The Hon. Sri N. Sanjeeva Reddi :—అట్లాంటిదేమీ జరుగలేదు. నేను నెంబరు 530 H/374 dated 23-12-53 గల లేఖను Planning Commission వారికి వ్రాశాను. ఈ విషయంలో ఆంధ్ర హైదరాబాద్ ప్రభుత్వాల యింజనీర్ల joint report ను పంపించవలసినదిగా కోరాను. అంతకంటె నేనేమీ చెప్పదలచుకోలేదు. ఆ తరువాత యెవరు యెట్లా భావించినా నేను బాధ్యుడనుకాను.

Sri C. Pulla Reddi :—నందికొండతోపాటు సిద్ధేశ్వరం ప్రాజెక్టును కూడ అంటే యీ రెండుకూడా పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి ప్రభుత్వము యేమైనా చర్యతీసుకుంటుందా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :—మేము ఆ రకంగా వ్రాశాము. నందికొండ ప్రారంభం కాకముందే సిద్ధేశ్వరం project నిర్మాణం గురించి, Hyderabad ప్రభుత్వముతో తగాదాపడకుండా, తగు ఒడంబడికకు వచ్చినట్లయితే, పులిచింతల, సిద్ధేశ్వరం ప్రాజెక్టులు కట్టడానికి వీలవుతుంది. దానినిగురించి 20 యేండ్లలోనైనాసరే, యీ మూడు ప్రాజెక్టులను నిర్మించాలని కూడా ఢిల్లీ ప్రభుత్వానికి వ్రాశాము. వీటివిషయమై యేవిధమైన అడ్డువుండదని యీ మూడు ప్రాజెక్టులను 20 years లో complete చేయవలసినదిగా అఖిలభారత ప్రభుత్వానికి వ్రాశాము. సిద్ధేశ్వరం ప్రాజెక్టు కట్టడంవల్ల హైదరాబాద్ గ్రామాలలోని భూమి చాలవరకు మునిగి పోతుందనే భయము వల్ల వారు అడ్డుకుంటారేమోననే సందేహము మనకు వుండనక్కరనేలేదు.

వారి ఒప్పందల పై agreement ద్వారా పొందడానికి హైదరాబాద్ ప్రభుత్వమును ఆంధ్ర ప్రభుత్వము కోరు తున్నది.

ఖోస్లాకమిటీ recommendation ప్రకారము 26 లక్షల యెకరాలు సాగు కావడానికి అవకాశము వుండేటట్లుగా, 20,000 క్యూసెక్కులు దక్షిణకాల్వగుండా పారేటట్లు వారు సలహాయిచ్చారు. అయితే 15,000 క్యూసెక్కులు మాత్రమే వస్తుంది. దీని ఫలితంగా 18 లక్షల యెకరాల సాగుకు, 75 కోట్లరూపాయలు ఖర్చు అవుతుందని వ్రాసినట్లుగా మన Chief Engineer, Sri L. Venkatakrishnayya గారు చెప్పారని పత్రికలలో ప్రకటించ బడింది. దానికి Planning Commission వ్యతిరేకిస్తుం దని చెప్పి, దానిని పునర్విమర్శన చేయవలసినదని కేంద్ర ప్రభుత్వానికి వ్రాశాము. అయినప్పటికి ప్రత్యేక ప్రశ్న వేస్తే చెపుతాను. అందుచేత యిప్పుడు wrong information యివ్వడము మంచిదికాదు. Correct information తరువాత యిస్తాను.

Sri P. Pundarikakshacharyulu :— Hyderabad ప్రభుత్వమునకు మనకు మధ్య ఒప్పదం కుదిరితే చాల సంతోషమే. ఒకవేళ ఆ విధంగా ఒప్పందము రాకపోతే, యీ నందికొండ ప్రాజెక్టు ఆపుచేసే అవకాశము యేమీ లేదుకదా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :— వస్తుందనే ఆశిస్తున్నాను.

Sri G. C. Kondayya :—అధ్యక్షా, మంత్రిగారు డాము యెత్తు యెక్కువ చేయడానికే ప్రయత్నము చేస్తున్నామన్నారు. కాలవలు త్రవ్వుతారన్నారు. కాబట్టి, యిదివరకు నెల్లూరు జిల్లాకు సంబంధించిన కాలువవల్ల సాగు, తగ్గుతుందని యింజనీర్ల అభిప్రాయము వున్నది. దీనికి అనేక కారణాలు వున్నవంటున్నారు. ఈ Engineers అంతా అరవ యింజనీర్లు కాబట్టి, వారికి నీరు కొరత కాబట్టి, దక్షిణాదికి తీసుకొని పోవడానికనే అభిప్రాయంవుంది. ఇప్పుడు high level నుండి నీరు తీసుకొని పోవడానికి కాలువలు త్రవ్వించుటకు plans వేసి ప్రయత్నిస్తున్నారని కేంద్రప్రభుత్వానికి సూచించునట్లు అప్పుడప్పుడు పత్రిక [illegible] చదివాము. మరికొన్ని major projects ను సూచించినట్లు

25th February 1954]

పత్రికలో ప్రకటించిన దానికి కేంద్రప్రభుత్వంయొక్క సమాధానాలు యేమిటో శెలవిస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :---ఈ ప్రశ్నలో చాలా విషయాలువున్నాయి ఇందులో కాలువలు, ప్రజలు, ప్రాజెక్టులు, నీళ్లు వీటిని గురించి వుంది. ఇదిచిన్న ప్రశ్నకాదు. కాని అడిగినవన్ని కొండయ్యగారే వెంటనే సమాధానము చెప్పగలరేమోకాని, నేను మాత్రం చెప్పలేను. Engineers కనీసం 10 యేండ్లు అనుభవం వున్న వారుకూడా చెప్పగలరేమోకాని, అంతకు తక్కువవున్నవారు జవాబు చెప్పలేరు.

Sri M. Bapaiah Chowdary :---మంత్రిగారు జవాబు యిస్తూ, యీప్రాజెక్టును పంచవర్షప్రణాళిక రెండవదశలో చేర్చడానికి సిఫార్సు చేశామని సెలవిచ్చారు. ఈ నందికొండ ప్రాజెక్టును ఒకదానినే చేర్చ మని సిఫార్సుచేశారా? లేక ఆంధ్రదేశంలోవున్న అన్ని ప్రాజెక్టులను చేర్చమని సిఫార్సుచేశారా? అందుకుగాను ప్రత్యేక report యిక్కడ నుంచి పంపించారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi :-"సిద్ధేశ్వరం, పులిచింతల, యీ నందికొండ ప్రాజెక్టుకు అడ్డు అని కాకుండా, వీటినన్నింటిని 20 years లో కట్టండి" అని వ్రాశాము. అన్నిటినీ వెంటనే నిర్మాణముచేయ మని కోరలేదు. ఒకప్రాజెక్టుకు మరొక ప్రాజెక్టు ఆటంకం రాకుండా నందికొండ తీసుకొనడానికి మాకేమీ ఆక్షేపణలేదు. Stage by stage వీటిని తీసుకొనమని చెప్పాము.

Sri M. Bapaiah Chowdary:-ఇందులో, first five years plan లో మొదటిభాగములోనే ప్రారంభించాలని తమరేమైనా సూచించారా?

The Hon. Sri N. Sanjeeva Reddi :-మేము first priority నందికొండ ప్రాజెక్టుకు యివ్వమని చెప్పాము. కాని అవి దీనికి వెనుక పెట్టాలని నాపుద్దేశ్యం.

ఇప్పుడు చల్లాసుబ్బారాయుడుగారు, మీరు, వేసిన ప్రశ్నలు సమ న్వయ పరచాలి. వివిధ దృక్పథాలకు సమాధానము యిచ్చే పరిస్థితిలో లేము. అవి చేర్చడానికి నాల్గు మూలల వుండే బాధ్యత మానెత్తిపై వుంది కాబట్టి, అప్పుడా విధంగా చేశాము.

[25th February 1954

Sri G. Latchanna :— Joint Engineers యొక్క detailed report యెన్ని రోజులలోగా final గా పంపబడుతుంది ?

The Hon. Sri N. Sanjeeva Reddi :— అక్కడ తిరిగి పరిశీలన చేసేకమిటీ ఒకటి మాత్రమే కాదు. వారంతా Hyderabad పోయినారు. ఆ కమిటి మెంబర్లలో శ్రీ Kunwar Sen గారు వున్నారు. వారు పరిశీలనచేసి పంపిస్తారు. వారు త్వరగా పంపిస్తే, యిక్కడ ప్రభుత్వ stage లో delay కాదు. అక్కడ నుంచి త్వరగావస్తే మన Engineers కాక All India Engineers కూడా delay చేస్తున్నారు. కాబట్టి వారు report పంపించిన వెంటనే అఖిల భారత ప్రభుత్వానికి పంపిస్తాము.

Sri K. Subba Reddi :— ఈ మధ్య ఢిల్లీలో నందాగారు సమాధానము యిస్తూ, ఖోస్లా కమిటీ నివేదికను మేము తప్పకుండా తీసుకోవాలనే నిబంధన లేదని సెలవిచ్చారు. వారు మాట్లాడినభాష విషయంలో గూడ వారు కృష్ణా - పెన్నారు ప్రాజెక్టును గురించి మాట్లాడారు. దానిమీద రాష్ట్ర ప్రభుత్వము యేమని సూచనలు చేశారు ? రాష్ట్ర ప్రభుత్వము యేమైనా గమనించిందా ?

The Hon Sri N. Sanjeeva Reddi:-ఖోస్లాకమిటీరిపోర్టునువారు గమనిస్తారా లేదాఅన్నప్పుడు వారి policy మీద depend అవడంలేదు. ఆ కమిటీ వుద్దేశ్యం ప్రకారము ఒకటిచేయడానికి, ఒకటి చెప్పడానికి అధికారం వుంటుందని Subba Reddi గారికి తెలియదేమోకాని, వారు ఏ పరిస్థితులలో, యెట్లా తీసుకొంటారో నేనెట్లాచెప్పగలను. ఆ కమిటీ చెప్పినదానిని కాదనడానికి యీ ప్రభుత్వానికి హక్కువుంది. వారు చెప్పిన సమాచారమును గురించి వ్యాఖ్యానము చేయడం కష్టం.

Sri K. Malakondayya :—ఈ నందికొండ ప్రాజెక్టుకు సంబంధించిన area లో యేమైనా minor irrigation projects వున్నాయా? వాటికి యిప్పుడేమైనా పని ప్రారంభించడానికి మొదలుపెట్టారా ?

The Hon Sri N. Sanjeeva Reddi :— పత్రికలలో వేసిన projects list వారు చూచివుంటారు. అవి నందికొండ area లో లేవనుకొంటాను. అవి ఎక్కడ వున్నాయో నేను సరిగా చెప్పలేనుగాని లేవనే భావిస్తున్నాను. గుండ్లకమ్మప్రాజెక్టు నిర్మాణాన్ని మాత్రం ప్రారంభించడానికి సాధ్యపడదని Planning Commission వారు reject చేశారు.

25th February 1954]

Sri Vavilala Gopalakrishnaiah :— Engineers పంపించిన final report Central Government నుంచి వచ్చివుందని నాకు స్వయంగా తెలుసు. నందాగారితో మాట్లాడేటప్పుడు చెప్పారు. అది యీనెలాఖరులోగా పంపగలిగితే చాలాబాగుంటుంది. Government యెంతోసహాయంచేసినవారవుతారు. నందాగారు మీGovernmentను reply త్వరగా పంపమని అడగండి అని అన్నారు. కనుక దానిని త్వరగా పంపించే ప్రయత్నంచేస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi:—ఈనాడే, 20 వ తేదీన Collectors Conference అయినతరువాత మన Chief Engineer హైదరాబాద్ వెళ్లారు. ఢిల్లీనుంచి Engineers హైదరబాద్ వచ్చారు. వారు, యితర officers నందికొండ వెళ్లారో లేదో నాకు తెలియదు. 4,5 రోజులువారు పర్యటించి, వారుఒక report వ్రాసిమనకుపంపించాలి. అది వచ్చినతరువాత ఆ dam యెత్తు 560 అడుగులు ఉండాలో, 590 అడుగులు ఉండాలో, యేది అవసరమో మనం పరిశీలించాలి. ఈ నెలాఖరులోగా పంపించమంటే, యిది సాధ్యమయ్యేదేనా? మీరే ఆలోచించండి.

Sri Vavilala Gopalakrishnaiah :—కనీసం 15 రోజులలోగానైనా కేంద్రప్రభుత్వానికి పంపిస్తే, April లోగా ముఖ్యంగా పని ప్రారంభించితే సౌకర్యంగా వుంటుంది. అందువల్ల అడుగుతున్నాను. ఎంత త్వరగా పంపిస్తే అంతబాగుంటుంది.

The Hon. Sri N. Sanjeeva Reddi :—ఖోస్లాకమిటి report ప్రకారం 590 అడుగుల యెత్తుపెడితే బాగుంటుందని వారు చెప్పారు. ఆ విషయంలో Hyderabad, Andhra ప్రభుత్వాలమధ్య రాజీ కుదిరిన తరువాత పంపిస్తే చిక్కులు యేర్పడవు. ఏమైనా వారు చెప్పింది మేము వొప్పుకునే పరిస్థితుల్లో లేము. అవన్నీ పరిశీలిస్తేగాని, మనం పంపించడానికి వీలులేదు.

## *Grant to Legislature Library.*

*167 Q.—Sri M. R. Apparao:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether any grant has been given to the Legislature Library; and if so, how much; and

(b) how much of it is used?

[25th February 1954

The Hon. Sri N. Sanjeeva Reddi:—(a) Yes, Sir. A provision of Rs. 20,000 - has been made to the Andhra State Legislature Library for the second six months of 1953-1954.

(b) Orders have so far been placed with various booksellers for the supply of books worth about Rs. 12,000/-.

*Taking over of inams.*

*170 Q.—Sri G. C. Kondaiah:—Will the Hon. the Minister for Land Revenue be pleased to state whether all the inams, major, and minor, will be taken over by the Government?

The Hon. Sri K. Koti Reddi:—All the major inams constituting Estates with in the meaning of section 3 (2) (d) of the Estates Land Act, excepting 78 of such estates which are covered by the stay orders of High Court or the appeals filed before the Estates Abolition Tribunals and the post 1936 inams have already been taken over by the Government. The 78 major inams aforesaid will be taken over by the Government as and when the stay orders of the High Court are vacated or the appeals filed before the Estates Abolition Tribunals are disposed of. The question of taking over the post-1936 inams which are not included in the Zamindari Abolition Act will be considered by the Government in due course. The question of taking over minor inams does not arise as these inams do not fall within the purview of the definition of 'Estate' in Section (2) (d) of the Estates Land Act.

*Harijan Day.*

*173 Q.—Sri G. Yellamanda Reddi:—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state whether the Government are still observing the *Harijan day* on the 30th of every month even after the death of Sri Potti Sriramulu?

The Hon. Sri D. Sanjivayya :—Yes, Sir.

*[Note: An asterisk (*) at the commencement of a speech indicates revision by the member]*

## DISCUSSION RE : HOURS OF SITTING OF THE HOUSE

Sri R. Siddanna Gowd:—On a point of order, Sir. ఈ శాసన సభాసమావేశము జరిపే కాలము విషయంలో కొన్ని observations చేయదలచాను. ప్రాతఃకాలము 11 గంటలకు ప్రారంభము చేసి 1 గంటకు ముగించి 1 గంట విశ్రాంతికాలము 1 గంట మొదలు 2 గంటలవరకు యిచ్చి, తిరిగి సాయంకాలము సమావేశం 2 గంటలకు ప్రారంభించడము వల్ల చాల యిబ్బందులు సభ్యులకు కలుగుచున్నవి. ప్రొద్దుట సమావేశము 1 గంటకు ముగించి, తిరిగి సాయంకాలము సమావేశము 3 గంటలకు ప్రారంభించినయెడల 2గంటల వ్యవధి సభ్యులకు వుంటుంది. సాయంకాలము కూడ మెంబర్లకు recreation కొరకు కాలము వుంటుంది, evening సమావేశములో business క్రమంగా జరుపుకునే అవకాశము వుంటుంది. ఆవిధముగా కాక, ఒంటిగంటకు విశ్రాంతినిచ్చి మరల 2 గంటలకే evening సమావేశము జరిపినయెడల సభ్యులు ఒకగంట విశ్రాంతికాలములో భోజనము చేసి evening సమావేశమునకు హాజరగుట కష్టముగావున్నది. అందువల్ల అధ్యక్షులవారు యీ విషయములో అభిప్రాయమివ్వవలెనని కోరుతున్నాను. Morning సమావేశము 9 గంటలకైనా ప్రారంభము చేయవచ్చును. అందువల్ల evening సమావేశము 4 గంటలపాటు అంటే 2 గంటలనుండి 6 గంటలవరకు సమావేశము జరిపిన యెడల,referenceకు library books, records చూచుకొనుటకు, పత్రికలు చదువుకొనుటకు అవకాశము వుంటుంది. అందుచేత భోజనముతరువాత రెండుగంటల interval లేకుండినయెడల యిందులో చాలమంది సభ్యులకు యిబ్బందులు కల్గుచున్నవి. కనుక అధ్యక్షులవారు యీకాలనిర్ణీతము విషయములో ఒకనిర్దిష్టమైన అభిప్రాయమును యివ్వవలసినదిగా కోరుచున్నాను.

Mr. Speaker:—మీరందరు ఒప్పుకుంటే నాకు అభ్యంతరము లేదు. ఇదివరకు ఒకటి, రెండు రోజులు ప్రయత్నములుచేశాము. ఏమి అగ్రిమెంటుకు రాలేకపోయాము. చిట్టచివరకు 11 గంటల మొదలు 5 గం.ల వరకని చెప్పాము ముందుగా పెట్టితే కొంతమందికి ఇబ్బందిగా వుంది. ఇంతకంటే నేను ఏమీచెయ్యలేను.

## ADJOURNMENT MOTION re: BEATING OF CERTAIN PERSONS BY THE POLICE

Mr. Speaker :--Sri P. S. Ramachandra Rao has given notice of an adjournment motion which reads as follows.

"పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకా కానూరు అగ్రహారం గ్రామంలో 1954 జనవరి 14 మొదలు 16 వ తేదీవరకు కొవ్వూరు పోలీసు సర్కిలు ఇనస్పెక్టరు అధ్వర్యాన జరిగిన హింసాకాండ అనగా విచక్షణా రహితంగా లాఠీలతో ప్రజలను కొట్టి, స్త్రీలను గుడ్డలూడదీసి అవమానించుట మొదలైన రాక్షస చర్యలు అత్యవసర విషయం గాన వాటిని గూర్చి చర్చించుటకు యీ సభను వాయిదా వేయగోరుతున్నాను."

ఎక్కడో పోలీసు ఇన్‌స్పెక్టరు కొంతమందిని కొట్టారని వారిమీద కేసులుపెట్టి తగినచర్య తీసుకుంటారా అని అడిగారు. దీనిని త్రోసి వేయుచున్నాను.

Sri P. S. Ramachandra Rao :-ఇది చాలా అవసరమైన విషయము గనుక చర్చించటానికి అవకాశం యివ్వాలి.

Mr. Speaker:- అంత ప్రధానమైన విషయంగాదు గనుక-త్రోసివేయుచున్నాను. సబ్ ఇన్‌స్పెక్టర్లు-పోలీసులు ఎక్కడైన కొట్టటం వగయిరాలు జరిగితే వాళ్ళమీద కేసులు పెట్టుకొనవచ్చును. అటువంటి విషయాలన్నీ చర్చించటానికి వ్యవధిలేదు. అందువల్ల disallow చేయుచున్నాను.

Sri Pillalamarri Venkateswarlu:—ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. ఇంతకంటే దేనికి importance యివ్వాలో తెలియటంలేదు. ఎక్కడైనా మంత్రులనుగాని, తదితర ప్రముఖులను అరెస్టు చేయటం జరిగితే అప్పుడు విచారిస్తారా ?

Mr. Speaker:—ఏమిటి ? మంత్రులను అరెస్టుచేయటమా?

Sri Pillalamarri Venkateswarlu :—తమకు, అటువంటి విషయములు ముఖ్యమైనవా అని అనుకుంటున్నాను.

Mr. Speaker :—Sri P. వెంకటేశ్వర్లుగారిని, కూర్చోమనటం, వారు మరల మరల లేచి చెప్పబోవటం జరిగింది.

Sri K. V. S. Padmanabha Raju:—అధ్యక్షా,ఒకసారి రూలింగ్ యిచ్చినతరువాత, దానిమీద మరల చర్చలుజరపటం సాంప్రదాయమా అనుకుంటున్నాను. ఇందును గురించి, ఒక తీర్మానం చేయుటంమంచిది,

## 2 PRIVILEGE MOTION re: PROHIBITION ENQUIRY COMMITTEE.

Sri M. Bapiah Chowdary:--Sir, I move the following Privilege motion of which I have given notice:--

"That when Prohibition has been entrusted to a committee of experts for enquiry and report, the Deputy Chief Minister has made speeches regarding Prohibition affecting the privileges of members, and the same may be referred to the Privileges Committee.

అధ్యక్షా ?

29-12-1953 వ తేదీన, మద్యనిషేధమును గురించి నివేదికను తయారుచేయడానికి ఒక కమిటీని ఏర్పాటుచేస్తానుని ఈ సభలో announce చేశారు. కమిటీని వేసినట్లు పేపర్లలో ప్రకటనచేశారు. పత్రికలలో పడినతరువాత, కమిటీని వేస్తున్నామని ఈసభలో ప్రకటించ బడింది. ఆకమిటీవారు 15-2-54 వ తేదీని తమ నివేదికను ఈ సభవారికి అందజేయాలని పత్రికలలో ప్రకటన వచ్చిందికూడాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:— ఈ సభకు కాదు, ప్రభుత్వానికి.

Sri M. Bapaiah Chowdary:— మొదట ప్రభుత్వానికి, తరువాత ప్రభుత్వం ద్వారా ఈసభకు ప్రభుత్వానికి వచ్చినతరువాత, ఈ సభయందు పెట్టవలసిందే గదా? అలాంటప్పుడు Deputy Chief Minister గారైనసంజీవరెడ్డిగారు ఫిబ్రవరి 9 వ తేదీన జగ్గయ్యపేటలో మాట్లాడుతూ యిలాచెప్పారు. 30 సంవత్సరములనుండి కాంగ్రెస్ వారు మద్యపానము వద్దని ప్రచారముచేశారు. అది రద్దుచేస్తే యీరోజు అంతా వద్దంటున్నారు. గ్రామంలో ఒకడు సారాబట్టీపెట్టి 100 మంది బీదవాళ్లను త్రాగించి, తాను సుఖపడుతున్నాడు. ఎవరికి సుఖము ఉన్నదో ఆలోచించండి. అరుగులమీద కూర్చుని కబుర్లు చెప్పితే చట్టము అమలు జరగదు. ఒక సబ్ ఇనస్పెక్టర్ ఏమిచేస్తాడు. రద్దుచేయమని, ఆ డబ్బుతో ప్రాజెక్టులు, స్కూల్సుకట్టమని కమ్యూనిష్టులు, లోక్ పార్టీవారు ప్రచారము చేస్తున్నారు, దొంగతనము వేదకాలమునుండి తప్పలన్నారు. యిప్పటికి మానినారా, ఎన్ని చట్టాలు ఉన్న ఏమిప్రయోజనము. బీదవాడు త్రాగేడబ్బుతో కాలేజీలు

[Sri M. Bapaiah Chowdary] [25th February 1954

కట్టించినిచితే అందులో చదువుకొనువారు భాగ్యవంతుల పిల్లలే. నిన్న విజయవాడలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ మద్యపాన చట్టమును రద్దుపరచుటకు అంగీకరించబోమని తీర్మానము చేశారు. ప్రజలు మద్యనిషేధం రద్దుచేయాలని కోరుతున్నారని కొందరు అంటున్నారు. నాలుగు తాలూకాలలో లైసెన్సులు తీసుకుంటే తెలుస్తుంది. దొంగ సారా కాచేవారిని కఠినముగా శిక్షించవలయును. ఎన్నాళ్లో కృషిచేసి యీనాడు మా చేతుల మీదుగా రద్దు పరచుటకు అంగీకరించం, ఈ సంగతి ఢిల్లీలో చెప్తాము అని చెప్పారు. వీరు ఆ మద్యపాన నిషేధ కమిటీని 15-2-54 వ తేదీకి report submit చేయమని అన్నారు. ఆ committee ఏర్పరచినటువంటి మంత్రివర్గ Deputy Chief Minister హోదాలో ఆ committee సాక్ష్యములను స్వీకరించుచున్నచోటు, అక్కడికి సమీపమున ఇలాగ ఉపన్యసించవచ్చునా? అలా చెప్పడంలో గల అర్థమేమిటి? ఆయన జగ్గయ్యపేటలో చేసిన ఉపన్యాసంలో ఏమి చెప్పారో అది ఇక్కడ చదివి వినిపించాను. అందులో వారు ఈ మద్యనిషేధం రద్దుచేయటానికి మేము ఒప్పుకోము అని ఢిల్లీలో కూడా చెప్తామన్నారు. కాకపోతే అక్కడ వీరు చేసినటువంటి speech శాసనసభా కాంగ్రెస్ పక్షం వీరి నాయకత్వం క్రింద ఉండడంవల్ల, అక్కడ ఆ కమిటీకి సాక్ష్యం యిచ్చే ఆ ప్రాంతపు శాసన సభ్యులను కూడా ఈవిధంగానే సాక్ష్యం యిమ్మనో లేక వారిని సాక్ష్యమివ్వటానికి హాజరు కావద్దనో, అచ్చటి కాంగ్రెస్ వాదులను, కాంగ్రెస్ శాసనసభ్యులను, ప్రజలను నిర్దేశించటానికి మాత్రమే అయివుంటుంది. ఇలా చెప్పడంవల్ల అది solicitation of witnesses అవుతుంది. ఇది breach of Privilege of the House అవుతుంది. ఎందువలనంటే

"To tamper with a witness in regard to the evidence to be given before either House or any committee of either House or to endeavour, directly or indirectly, to deter or hinder any person from appearing or giving evidence is a breach of privilege"......

Corruption or intimidation, though a usual, is not an essential ingredient in this offence. It is equally a breach of privilege to attempt by persuasion or solicitations of any kind to induce a witness not to attend, or to withhold evidence or to give false evidence."

Government కు గాని, Government Committee ముందు గాని, House Committee ముందుగాని evidence యివ్వవలసినవాళ్లను

direct గా గాని, indirect గా గాని, evidence ఇలా యివ్వవలసిందని ఆదేశించడంగాని, బెదిరించడంగాని, breach of privilege అవుతుంది. అందుచేత సంజీవరెడ్డిగారు ఈ Prohibition committee సాక్ష్యములు, ప్రజాభిప్రాయం సేకరించే చోట ఈ విధంగా చెప్పడం ప్రజలను committee ఎదుట హాజరు కావద్దనిగాని, కాంగ్రెస్ శాసనసభ్యులను గాని, ఆయాప్రాంతములలోని కాంగ్రెస్ వారిని ఆ committee ఎదుట evidence యివ్వడానికి హాజరుకావద్దని, ఒకవేళ హాజరైతే నేను చెప్పిన విషయములు చెప్పండిఅని false-evidence యివ్వమని చెప్తున్నట్లు కనిపిస్తున్నది. ఇది breach of the privilege by solicitation or persuasion అవుతుంది. మేము మద్యపాన నిషేధమును రద్దు చేయబోవడం లేదనీ, ఈవిషయమై ఢిల్లీలోకూడా చెప్పబోతున్నాము. అని వారు అన్నారు. అంటేవీరు, ఇలాచెప్పడంవల్ల solicitation of witness or by persuasion జరిగింది. దీనివల్ల breach of privilege జరుగుచున్నది. రెండవదేమిటంటే 15-2-54 వ తేదీ లోపల ఆ committee వారిని report submit చేయాలని అన్నారు. అప్పటికి committee వారు ఇంకా సాక్ష్యములను, ప్రజాభిప్రాయాన్ని సేకరించుచున్నారు. అప్పుడు by persuasion or solicitation of witness కు ప్రయత్నించారు అని వీరి ఉపన్యాసమునుబట్టి తెలుస్తోంది. ఇది breach of privilege క్రిందకు వస్తుంది. గనుక ఈవిషయాన్ని Privileges Committeeకిపంపవలయుననిఅధ్యక్షులవారినికోరుతున్నాను.

The Hon. Sri T. Viswanatham:— Prima facie case ఉన్నదా లేదా? అని చూడాలి. Prima facie ఏమీలేదని నేను మనవి చేస్తున్నాను. ఎందుచేతనంటే ఎసెంబ్లీ సమావేశం మొదటనే privilege motion ను 22 వ తేదీన తీసుకురావలసిఉంది. 22 వ తేదీన లేదు 23 వ తేదీన లేదు, 25 వ తేదీన తీసుకువచ్చారు.

Mr. Speaker :—It was brought to my notice earlier but I postponed it.

The Hon. Sri T. Viswanatham :— Then I withdraw what I said.

రెండవదేమిటంటే దీనిపైన privilege motion తీసుకురావడానికి అసలు వీలులేదు. ఎందుచేతనంటే ఇది గవర్నమెంటుచేత appoint చేయబడిన committee గాని House నియమించిన committee కాదు.

House నియమించిన committee అయినట్లైతే దానిపైన House లోని Members ఇక్కడ Privilege motion తీసుకురావచ్చునుగాని Government వేసిన Committee కు House కు ఏమీ సంబంధం ఉండదు. దీనిని appoint చేసినప్పుడు గవర్నమెంట్ ఈ House ను consult చేసి వేసిన కమిటీ కాదు. సంజీవరెడ్డిగారు అక్కడ ఆ విధంగా statement చేశారు అంటె అప్పుడు కాంగ్రెస్ పార్టీ తరఫుననే మాట్లాడారు ఆయన అక్కడ Deputy Chief Minister గా ఆ statement చేయలేదు. అక్కడ ఆయన ఏదైనా చెప్పిఉంటే అది ఈ committee కి సంబంధించినదైతే దానిని గురించి ఏమీ ఇక్కడ చర్చచేయ నవసరంలేదు. ఆయన అప్పుడు పార్టీకి సంబంధించిన విషయాలను చెప్పారు. అందువలన దీనిని ఇక్కడ చర్చించవలసినపనిలేదు. అందులోను ఇది House వేసిన committee కాదు. ఇది గవర్నమెంటు committee. అందువల్ల దీనికి prima facie case లేదు, దీనిని Privilege Committee కి పంపనవసరంలేదని మనవి చేస్తున్నాను.

The Hon. Sri N. Sanjeeva Reddi:—ఇది House వేసిన committee ఏమాత్రం కాదు. ఈ committee ని గవర్నమెంటు appoint చేసినది. కాబట్టి ఈ కమిటీకి, ఈ House కు ఏమాత్రం సంబంధం లేదని మనవిచేస్తున్నాను క్రితంసారి శాసనసభా సమావేశంలో ఈ కమిటీని appoint చేసినపుడు మీరు మాకు తెలుపకుండా, మాతో consult చేయకుండా ఈ కమిటీని వేశారు. అలాకాకుండా ఈ House కు తెలుపకుండానే, ముందు పత్రికలలోకూడా ఆ కమిటీని వేసినట్లు, ఆ కమిటీ మెంబర్ల పేర్లను ప్రకటించడమైంది ? దీనికి కారణం ఏమిటి? అని అడిగారు. అప్పుడు శ్రీ పట్టాభిరామారావుగారు ముందు House కు ఈ కమిటీగురించి తెలుపలేదు, చాలా విచారిస్తున్నాను అని చెప్పడం జరిగింది. అందువల్ల ఈ Committee ని అసలు గవర్నమెంటే appoint చేయడమైనది, దీనికి House కి ఏమాత్రం సంబంధం లేదు. అందువల్ల ఇప్పుడు ఈ House యొక్క privileges కేమీ భంగం ఉండదు. ఆ Committee గవర్నమెంటు వారికే report ను submit చేస్తారు. అది Government కనుక ఆచరణయోగ్యమని తలిస్తే దానిని అనుసరించుతారు. లేకపోతే వారు ఆ report ను ఆచరణలో పెట్టక పోవచ్చును. దానికేమీ యిబ్బందిలేదు. ఖోస్లాకమిటీని ఇండియా గవర్నమెంటువారు appoint చేశారంటే వారు సమర్పించిన నివేదికను

25th February 1954] [The Hon. Sri N. Sanjeeva Reddi]

అమలుజరిపారా? అమలుజరుపుతారా అనిఅడిగితే కేంద్రప్రభుత్వ మంత్రి నందాగారు, ఈ కమిటీని వేసినట్లైతే దాని నివేదిక ప్రకారం కార్యక్రమం అమలుజరగాలని లేదు, అన్నారు. గవర్నమెంటు అనేక కమిటీలను వేస్తుంది. ఆ కమిటీల నివేదికను పూర్తిగా అమలుజరపాలని ఏమీలేదు. ఆకమిటీ నివేదికలలో ఏవైనా మంచివి, గవర్నమెంటుకి అనుకూలమైనవి ఉంటే వాటిని తప్పకుండా అమలు పరుస్తాము ఇండియా ప్రభుత్వం ఖోస్లాకమిటీ నివేదికను పూర్తిగా అమలుజరపలేదే. ఈ Prohibition Committee కేవలం ప్రభుత్వం చేతనియమించబడినదే కాబట్టి దీనికి House కు ఏమీసంబంధ లేదు. దీనికి House కు సంబంధంవుంది అందు వల్ల దీని విషయమై Privileges Committee కి పంపవలయునని అన డంచాలాపొరపాటు. House కు ఏమాత్రం సంబంధంలేదు, కనుక దీనిని Privileges Committee కి పంపించనవసరంలేదని, దీనికి prima facie case లేదని నేను మనవి చేస్తున్నాను. దీనిని మీరు allow చేస్తే చెయ్యండి. దీనిపై discussions అన్నీవింటాము.ఎంతసేపైనా వింటాము. కాని దీనికి prima facie case లేదని, ఈ committee కి ఏమీసంబంధం లేదని, దీనిని Privileges Committee కి పంపనవసరం లేదని మనవి చేస్తున్నాను. అందుచేత మీరు దీనిని Privileges Committee కి పంప కుండానే దీనిపై decision యివ్వమని మనవి చేస్తున్నాను.

Sri G. Latchanna :—ఒక కమిటీని గవర్నమెంటు ఏర్పాటుచేసి యుంటే ఆ కమిటీ రిపోర్టును చర్చించేహక్కు శాసనసభకు ఉంది. గవర్నమెంటు శాసనసభవారి సూచనల ప్రకారం అనుసరించడానికి ఏర్పడిన ఒక executive body మాత్రమే కాబట్టి దాన్ని చర్చించ అవకాశం లేదంటేవీలులేదు. దాన్ని ముందుగానే శాసనసభముందు పెడతాం అని చెప్పారు. ఆ కమిటీసూచనలను పాటించనపుడు దాన్ని ఎందుకు ఏర్పాటుచేసిందో నాకు తెలియకుండా ఉంది. మద్యపాన నిషేధాన్ని రద్దుచేయాలి అంటే దాన్ని ప్రతిఘటించితీరుతాం అని చెప్పితే అది శాసనసభ సాంప్రదాయంకు విరుద్ధం. ఆ కమిటీ రిపోర్టును దాని ఉద్దేశాలను భంగపరచడం జరుగుతుంది. అందుచేత దీనిలో prima facie కేసు ఉందనీ నేను చెపుతున్నాను.

Mr. Speaker:—Unless I give a finding that there is a prima facie case, the other Members should not speak.

(Sri M. Hanumantha Rao rose to speak).

Mr. Speaker:—The Hon. member will please resume his seat.

Sri M. Bapaiah Chowdary:—డిప్యూటీ చీఫ్ మినిష్టరుగారు సెలవిస్తూ ఇది హౌస్‌కమిటీ కాదు, ఈ కమిటీకిని, శాసనసభకు సంబంధములేదు, అందుచేత దీనిమీద discussions చేయకుండా rule out చేయమని చెప్పారు. నేను ఇప్పుడు లచ్చన్నగారితో ఏకీభవిస్తున్నాను. ఆరోజున మంత్రిగారు ఒక ప్రకటనచేస్తూ ఏమి చెప్పారంటే దాన్ని అమలుపరచవలసిన విధానం గాని దానిమీద అంతిమనిర్ణయం చేసేవిషయంగాని సభవారికే వదలివేస్తూ ఈ కమిటీని నిర్ణయించారని చెప్పారు. దీనికి ఆరోజున తమరుకూడా సంజాయిషీ అడిగారు. అందుచేత ఏవిధమైన చర్య అయినా ఈ శాసన సభలోనే నిర్ణయించవలసి ఉంది. ఆ కమిటీని ఈ శాసనసభయొక్క కమిటీగానే భావించవలసి ఉంది. దాన్ని ఈశాసనసభయొక్క కమిటీ కాదని చెప్పటం చాలా శోచనీయమైన విషయం. అది ఈశాసన సభయొక్క కమిటీఅని మీరు అంగీకరించక తప్పదు. విశ్వనాధం పంతులుగారు ఈ విషయమై ఎవరూ సాక్ష్యం వెళ్ళలేదని చెప్తున్నారు. సంజీవరెడ్డిగారు చెప్పిన మీదట సాక్ష్యం స్వీకరించకుండా జనం వస్తారో రారో మేము చూస్తాం. "Its retention or otherwise or a suitable amendment should be made in the interests of the people."

"It is equally a breach of privilege to attempt by persuasion or solicitations of any kind to induce a witness not to attend or to withhold evidence or to give false evidence. ఇప్పుడు పంతులుగారు చెప్పిన దానిమీద Deputy Chief Minister గారు చెప్పిన దానిమీద కొంత effect వస్తుందని వారు చెప్పారు. ఆ మాట్లాడిన మాటలను మేము దీనిలో పొందుపరుస్తే మేము సాక్ష్యానికి వెళ్ళనక్కరలేదు.

Mr. Speaker:—How is it a committee of the House? Is it the House that is insulted or the Committee?

Sri M. Bapayya Chowdary:—Both the House and the Committee.

Mr. Speaker:—The Committee must be your committee. If not, and if the Committee is insulted, it is a different thing. It is for the Committee to safeguard its privileges. You must convince me that this Committee is a Committee of this House. If not, how is the privilege of the House breached?

25th February 1954]

Sri M. Bapaiah Chowdary ;—29-12-53 వ తేదీన ఇక్కడ ఒక కమిటీని నియమించాం అని చెపుతూ వారియొక్క report ను ఈ సభలో పెడతాం అని చెప్పారు. ఆరిపోర్టు మాఅందరికి ఇచ్చారు. దానిసమ్మరీ మాఅందరికికూడా అంద చేయడం జరిగింది. అది ఈసభ యొక్క కమిటీ అని ఆ రిపోర్టుమీద ఈసభవారు చర్చించడానికి హక్కు వుందని చెపుతున్నాను.

Mr. Speaker :—The House cannot consider that report and give a finding on it. It is a report submitted to the Government and Government may or may not look into the matter. If it is a question of the impropriety of the statement made, I would agree with the hon. Member. But if it is a question of privilege I do not see how it is a privilege. First there must be a privilege and then you have to prove how it is violated.

The Hon. Sri N. Sanjeeva Reddi :—ప్రివిలేజెస్ కమిటి ఒకటి ఉంది. ఇప్పుడు మన చీఫ్ ఇంజనీర్ హైద్రాబాద్ చీఫ్ ఇంజనీరు కలిపిచేసిన ఒక రిపోర్టును మేము ఇక్కడ పెడతాం అని చెప్పాను. అంత మాత్రం చేత, అది హౌస్ కమిటి ఎట్లా అవుతుంది. అట్లాగే ఇదికూడాను.

ఆ కమిటీ రిపోర్టును ఎంతవరకు accept చేయవచ్చు, ఎంతవరకు accept చేయకూడదనే limitations ఉంటాయి.

Mr. Speaker :—The Government having appointed a committee......

The Hon. Sri N. Sanjeeva Reddi :— నేను నందికొండను గురించి ఒక కమిటీని వేశాను. ఆ కమిటీ రిపోర్టు ఏమైనా ఉంటే దాన్ని గురించి ఇక్కడ చెపుతాం అని చెప్పాను. అంతమాత్రంచేత అది House నియమించిన committee అవుతుందని దాన్నిగురించి మంత్రులు గాని ఎవరుగాని మాట్లాడకూడదని చెబితే అదినాకేమి అర్థంకావడం లేదు. ఇప్పుడు యూనివర్సిటీని గురించి ఇద్దరితో ఒకమిటీని వేశాం. వాళ్లు ఇచ్చిన రిపోర్టు మీముందు పెడతాం. దాని మీద మాట్లాడ్డానికి వీలులేదంటే ఎలా ? ప్రొహిబిషన్ cancel చేయమని ఎట్లా ఉపన్యాసాలు ఇచ్చారని అంటున్నారు! కాని, వాడు బాహాటంగా ప్రొహిబిషన్ scrap చేయమని వారిష్టంవచ్చినట్లు ఉపన్యాసాలు చెప్ప డానికి వారికే హక్కుందిటకాని, నాకులేదట ! ఇదీ ఎంత న్యాయంగా

[The Hon. Sri N. Sanjeeva Reddi] [25th February 1954

ఉందో చూడండి! ఒక కమిటీ రిపోర్టు ఇచ్చినతరువాత దాన్ని ఎంత వరకు accept చేయాలి, లేక ఎంతవరకు ఏఏభాగాలు amend చేయాలి అలాచేస్తే ఎంతవరకు ఎఫెక్టివ్‌గా work out చేయకలుగుతాం అనే విషయాలన్నీ గవర్నమెంట్ చూచుకోవలసిందే. నాకు House ను అవమర్యాద చేయాలని ఏమాత్రం లేదు.

Sri T. Nagi Reddi :—ఇక్కడ ఒక చిన్నవిషయం చెప్పాలి. ఏమంటే... ... ... ...

Mr. Speaker :—I have heard the mover and the concerned Minister. I do not want to make it a general discussion......I cannot allow any other member to speak on this subject. I am going to give my ruling tomorrow.

Sri T. Nagi Reddi:—Privilege motion గాని, adjournment motion గాని వచ్చినప్పుడు ఆ మోషన్ పెట్టినవారొక్కరే మాట్లాడి మిగతావాళ్లు మాట్లాడకూడదని ఇప్పుడుచెప్పారు. Adjournment motion గాని privilege motion గాని వచ్చినప్పుడు సదరు మోషన్ యిచ్చిన వాళ్లు దానికిసంబంధించిన వాళ్లు క్రొత్త points చెప్పదలచుకుంటే మాట్లాడటానికి అవకాశం యివ్వడం సాంప్రదాయం.

Mr. Speaker :—Unless I admit the motion, I cannot allow a general discussion as if the motion is before the House. I was having some doubt on the point. I felt it came very near the mark. The question is whether there is a privilege or not. It may come very near the mark, but it must hit the mark. Therefore I heard both the hon. Members and I cannot allow any other hon. Member to make a speech.

Sri M. Bapaiah Chowdary rose to speak

Mr. Speaker :—I have heard enough.

Sri T. Nagi Reddi :—Speeches యివ్వదలచలేదు. అకమిటీ తనఅభిప్రాయాన్ని చెప్పడానికి హక్కువుంది. కాని కమిటీరిపోర్టు ఏమి యిచ్చినాసరే మేమీ మద్యపాననిషేధాన్ని రద్దుచెయ్యము అనిచెప్పడమువల్ల సభ్యులకు యిచ్చిన హక్కులకు భంగకరంకాదా? అంతేగాక అధికారంలో కూర్చున్నవ్యక్తి కమిటీరిపోర్టు వచ్చినతరువాత దానిని [illegible]ంచాలో ఎత్తివెయ్యాలో ఆలోచిస్తామని ఇక్కడచెప్పి, కమిటీ తమరిపో[illegible] రద్దుచేయ్యాలనీ చెప్పినాసరే మేము రద్దుచెయ్యము అని చెప్పి

సందువల్ల ఆ కమిటీవారికి ఎవ్వరూకూడా రిపోర్టులు పంపించినా లాభంలేదని impression కలుగచెయ్యడానికి ఉపయోగపడింది

Mr. Speaker:—Before admitting the motion I must be convinced that the committee is one appointed by the House.

Sri T. Nagi Reddi:—ఈ House లో వచ్చిన చర్చలకు సమాధానం చెప్తూ దీనిని విచారించడానికి ఒకకమిటీని వేశామని, ఆకమిటీకి అన్నివిధాలైన సాక్ష్యసేకరణకు అధికారం యిచ్చామని, సదరు కమిటీ రిపోర్టు సారాంశం మీముందు చర్చకు పెడతామని చెప్పినందువల్ల అది House కు సంబంధించిన కమిటీయే అవుతుంది. Freedom వుంది. 'మీరే రిపోర్టు produce చేసినా మేము మద్యనిషేధాన్ని రద్దుచేయ బోవడము లేదని ఉపముఖ్యమంత్రిగారు statement యిచ్చినతర్వాత, ఆకమిటీమీద సర్వవిధాలుగా influence చేసినతర్వాత ఈ house కు వుండే privilege ఏమిటి? సక్రమమైన రిపోర్టు రావడానికి అవకాశం ఏముంది? మాకిచ్చిన హామీ ఆవిధంగా త్రోసివేయబడింది కాబట్టి ఇది House యొక్క status కు భంగకరము.

Sri M. Hanumantha Rao:—ఈకమిటీని ఈ House వేసిందనే విషయంలో మీరు convince కావాలని ఏమైనా క్రొత్త points వుంటేనే మీముందు పెట్టాలని చెప్పారు. ఆపెట్టడానికి హక్కు అందరికీ వుంది.

Mr. Speaker:—Order, order. This is not a point of order. Virtually you are compelling me to hear you. I am not going to allow any other Member to speak on this matter.

(Sri M. Hanumantha Rao, then left the chamber.)

Mr. Speaker:—I cannot allow any other Member to speak on this........

I said that I have not come to the conclusion that there is a prima facie case. I felt as though the facts in the case came very near the mark and I wanted some clarification. So I asked both the hon. mover and the hon. Minister to have their say. I heard also the hon. the Leader of the Opposition.

[25th February 1954

Sri T. Nagi Reddi :—అధ్యక్షా, మేము రెండు సంవత్సరాలు ఉమ్మడిరాష్ట్రంలో పనిచేసినతర్వాత కొన్నికొన్ని విషయాలు తెలుసు కున్నాము. అవి మా అందరి బుర్రల్లోనూ పనిచేస్తున్నాయి. Privilege Motion వచ్చినప్పుడు ఎవరూ మాట్లాడకూడదని తర్వాత Opposition Leader మాట్లాడవచ్చని చెప్పారు. ఒకసభ్యుడు ఒక privilege motion యిచ్చినతర్వాత కొద్దిసేపు అయినాసరే యిచ్చినతర్వాత point ఏమిటి అని తెలుసుకోవడము జరిగేది. ఇక్కడకూడా అటువంటిదే వుంటుందని భావించాము. ఈ point క్రొత్తగా వున్నదికదా, దానిమీద మాట్లాడ డానికి సభ్యులకు వీలుంటుంది అని అనుకున్నాము. దానిని move చేసిన వారు తప్ప ఇతరులెవ్వరు మాట్లాడకూడదని దానికి సంబంధించిన సభ్యుని తరువాత మంత్రిగారి సమాధానం చాలని మీరు చెబితే ఇక ముందు ఆవిధంగానే అనుసరించడానికి నా నోట్ పుస్తకంలో వ్రాసు కుంటాను. అయితే ఇకముందు ఒక్కొక్క సభ్యుడు ఒక్కొక్కటిగాక, 4, 5 privilege motions పంపించవలసి వుంటుంది. అవి వ్రాసి యిచ్చినవాళ్లను 48 మందీ మాట్లాడడానికి వీలుంటుందని తెలుస్తోంది. అటువంటి సంప్రదాయం మేము నెలకొల్పుతాము. కాబట్టి సదరు motion ను move చేసినవాళ్లమే కాకుండా ఇతరులు కూడా మాట్లా డదలుచు కున్నప్పుడు వాళ్లనికూడా మీరుమాట్లాడనివ్వాలి.

Mr. Speaker :—దీనికింత తర్జనభర్జన చేస్తే ఎట్లా? ఇది privilege motion కాదనినేను satisfy అయితే దానిని House ముందు తీసుకు రానేరాను. 48మంది పెట్టినా వాటిని allow చెయ్యవలసిన అవసరం లేదని convince అయినప్పుడు ఈ House ముందుకు తీసుకురావలసిన అవసరమే లేదు. (నవ్వు) I wanted to clarify అని చెప్పాను. We are going to the next subject on the agenda.

## NON-OFFICIAL BUSINESS.

## (1) BILLS.

### (1) THE ANDHRA AGRARIAN BILL, 1953.

Sri Vavilala Gopalakrishnaiah:--Sir, I move for leave to introduce the Andhra Agrarian Bill, 1953.

అధ్యక్షా, నేను ఆంధ్రా అగ్రేరియన్ బిల్లును ఈ సమావేశంలో ప్రతిపాదించడానికి అనుమతి యివ్వమని సభ్యులను అడుగుతున్నాను. దీనిపేరు ఆంధ్రాఅగ్రేరియన్ బిల్లు. దీనిలోవున్న విషయాలేమంటే, మన దేశం ముఖ్యంగా ఆంధ్ర దేశం వ్యవసాయ దేశం? ఇదివ్యవసాయదేశంఅయి నందువల్ల వ్యవసాయాభివృద్ధికోసము మనము తీవ్రంగా ఆలోచించవలసి వచ్చినప్పుడు వ్యవసాయాభివృద్ధి యీనాడు పెరిగిందా, సాగుపెరిగిందా, ఉత్పత్తిపెరిగిందా అని ఆలోచిస్తే ఆంధ్ర దేశంలో 2 యకరాలలోపు వున్నవాళ్లు నూటికి 50 మంది, 5 యకరాలలోపు వున్నవాళ్లు నూటికి 30 మంది, 5 మొదలు 10 యకరాల లోపు వున్నవాళ్లు నూటికి 9 మంది, 10 యకరాలకు పైగావున్నవాళ్లు నూటికి 11 మంది వున్నారు. ఈ 11 మంది చేతల్లో భూమి 70 వంతులు వున్నది. దీనివల్ల ఋణభారం లెక్కవేస్తే, ఈ 70 వంతులు భూముల్లో అనేకమంది కౌలుదార్లు వున్నారు. వారు ఋణంభారంతో బాధపడుతున్నారు. భూమి వున్న వారికి ఋణం తగ్గితే భూమిలేనివారికి ఋణభారం పెరిగిపోయింది.

The Hon. Sri K. Koti Reddi:—I have no objection for the introduction of the Bill.

Mr. Speaker:--As the introduction of the Bill is not opposed the hon. Member need not make a long speech.

The question is:—

"that leave of the House be granted to introduce the Andhra Agrarian Bill, 1953"

The motion was carried and the Bill introduced.

Sri G. Latchanna :—వావిలాలవారు తయారుచేసిన బిల్లు as it is గానే గెజిటులో ప్రకటిస్తారా? అయితే ఆప్రకటన ఎప్పుడు జరుగుతుంది.

The Hon. Sri T. Viswanatham:—త్వరలోనే జరుగుతుంది.

## (2) THE ANDHRA LANDHOLDINGS (LIMITATION OF EXTENT) BILL, 1953.

Sri B. Krishnamurthy Rao:—Sir, I beg to move for leave to introduce the Andhra Landholdings (Limitation of Extent) Bill, 1953.

The Hon. Sri K. Koti Reddi :—I am not opposing this Bill also.

Sri Pillalamarri Venkateswarlu :—ఏది అంగీకరిస్తున్నారో, ఏది లేదో, దేనిక చర్చ జరగాలో తెలియకుండా వున్నది.

The Hon. Sri T. Viswanatham :--Introduction అయినది అంటే accept అయింది అన్నమాట రేపు ఎల్లుండిలోగా గెజెటులో అచ్చు అవుతుంది అందులో ఏమి వున్నదో తెలియకుండా మీరు మేము ఏమి చర్చచేస్తాం? గెజెటు వచ్చాక దేనిమీద చర్చ చేయాలో తెలుస్తుంది.

Mr. Speaker :--When it is opposed only a brief explanatory statement is permitted. Even then only a brief statement is permitted.

The question is :--

"that leave of the House be granted to introduce the Andhra Landholdings (Limitation of Extent) Bill, 1953."

The motion was carried and the Bill introduced.

## MOTIONS ON MATTERS OF PUBLIC INTEREST

### *Assignment of waste lands to the landless poor.*

Sri G. Nageswara Rao :—I beg to move "This Assembly recommends to the Government that all Government assessed, unassessed and unobjectionable and cultivable poramboke lands (either wet or dry) under the occupation and cultivation of any person possessing five or more acres be taken over by Government at once and assigned to the landless poor free of market value."

అధ్యక్షా! నా తీర్మానాన్ని ప్రవేశపెడుతూ యీ రోజున మన రాష్ట్రంలో యీ బంజరు భూములసమస్య చాలకాలంనుంచీ కూడా [illegible] ఆందోళన జరుగుతున్నప్పటికికూడా గత ప్రభుత్వంగాని యీ

రోజువున్న ప్రభుత్వంగాని యీ విధానాన్ని ఏమీ పరిష్కారం చేయకుండా యీ విధంగా విడిచిపెట్టడం చాలా విచారకరం అని మనవి చేస్తున్నాను ఒక్క అపోజిషను పార్టీ వాళ్లే కాకుండా యితర పార్టీలు అన్నీకూడా, అనేకమంది, బంజరుభూములసమస్య పరిష్కారం కావాలని కోరుతూవున్నారు. అయితే యిది యింకా పరిష్కారం కాలేదు. ఎందుచేత ? ఇప్పుడు మనరాష్ట్రంలో 31 లక్షల 42 వేల ఎకరాల బంజరుభూమి సాగుకు లాయికీ అయివున్నది. అయితే యింకా forest బంజరుభూమి కలిపిచూస్తే మొత్తం 40లక్షల ఎకరాలు బంజరుభూమి ఆంధ్రరాష్ట్రంలో వున్నది. గౌరవనీయులైన మంత్రి సంజీవయ్యగారు 16 లక్షలు ఎకరాల బంజరుభూమి వున్నదని statement యిచ్చారు అయితే అది సరికాదని నా వుద్దేశ్యము. అయితే యిప్పుడు అనేక వేల ఎకరాలు సాగులోవున్నది. కొన్ని వేలఎకరాలు సాగుకాకుండా వున్నది. ఈరోజున అనేకప్రాంతాల్లో బంజరుభూములు సాగుచేసుకొంటున్న పేదరైతులను గ్రామాధికార్లు, రివిన్యూ డిపార్టుమెంటు వారు అనేక యిబ్బందులకు గురిచేశారు. అయితే యీ బంజరు భూములు 10, 15 సంవత్సరాలనుంచీ కూడా వ్యవసాయ కూలీలు, బీదరైతులు సాగుచేస్తున్నారు. ఇటువంటి బంజరు భూముల్ని సాగుచేయడానికి, grow more food క్రింద ప్రోత్సహించడానికి బదులు వేలం వేయించి యిబ్బందులు పెడుతున్నారు. కొత్తపేట తాలూకా నరేంద్రపురం గ్రామంలో 400 ఎకరాల ఎస్టేటు బంజరు భూమివున్నది. అట్లాగే అమలాపురం తాలూకాలో అనుమల్లంకదగ్గర 3 వందల ఎకరాలు హరిజనులు సాగుచేస్తున్నారు 235 ఎకరాలమధ్య 75 ఎకరాలు రాజకీయ బాధితులకు యిచ్చి వారిమధ్య తగాయిదాలకు ప్రభుత్వంకారణమైనది. ఈ 75 ఎకరాల విషయంలో 144 Section కేసులు జరుగుతున్నవి. ఈ భూములు 10, 12, సంవత్సరాల నుంచి సాగుచేస్తూ వున్నారు. అదేవిధంగా penalty లు చెప్పవలసి వస్తే యీ పేదరైతులకు 20 రూపాయలు penalty వేస్తున్నారు రు 1-8-0 నుండి 2-0-0 వరకు ఎకరానికి పెనాల్టీ వేస్తున్నారు. ఆ గ్రామ కరణాలకు లంచం పెట్టకపోతే penalty లు తగుల్తున్నాయి. ఉదాహరణకు రాజోలుతాలూకా పడమటలంక గ్రామకరణంకు అమ్మాయి పెండ్లిలో వర్ధదరూపాయలివ్వ లేదని 20, 30 రూపాయలు యీబంజరు భూముల సాగుసాకుపెట్టుకొని penalty పడ్డది. అందుచేత ఈరకమైన అదనపు పెనాల్టీలు తాసీల్దారు యిష్టాయిష్టాలమీద ఆధారపడి జరుగుతున్నది.

కాకినాడతాలూకాలో 11వేల ఎకరాల బంజరుభూమి వున్నది. వ్యవసాయకూలీలు 19 వందల ఎకరాల సాగుపెట్టారు. Fishermen society వాళ్లు 2వేల ఎకరాలు ఆక్రమించారు. ఈరెండువేల ఎకరాలవిషయంలో భూస్వాములు వాళ్లను అటకాయించడం జరుగుచున్నది. సాగుదారులు అగ్నికులక్షత్రియులు. ఈ విషయంలో ఎంతోకాలంనుండీ ఆందోళన చేస్తూన్నప్పటికీ కూడా ఈ సమస్య అట్లాగేవున్నది. అదేవిధంగా రాజోలుతాలూకా అంతర్వేదిగ్రామంలో 22వేల ఎకరాలు బంజరు భూమివున్నది అల్లూరి పెద్దసూర్యనారాయణరాజుగారు 5 వందల ఎకరాలు సాగుచేయించుకుంటూవున్నారు. దీనిని ప్రభుత్వం దృష్టికి అనేక సార్లు తీసుకురావడం అయినది. హరిజనులు 700, 250 ఎకరాలు ఈ విధంగా ఆక్రమించుకున్నారు. అగ్నికులక్షత్రియులు 750 ఎకరాలు ఆక్రమించుకున్నారు. ఈ సమస్యాపరిష్కారానికి ప్రభుత్వం వెంటనే చర్య తీసుకోవాలని కోరుతున్నాను. కొల్లేరు బంజరుభూముల విషయంలో ఆ భూములన్నీ వ్యవసాయ రైతుకూలీలకు పంపకం చేసి వారికి pumping engines సప్లయిచేస్తే చాలమట్టుకు కొల్లేరు బంజరు భూమి సమస్య పరిష్కారం అవుతుందని మనవిచేస్తున్నాను.

అదేవిధముగ యీరోజున యీరాష్ట్రములో భూస్వాముల చేతులలో బంజర్లు ఉన్నాయి. సాగుచేయకుండా అట్లనే వుంచారు. ఈ భూములను ప్రభుత్వము బీదలకు, వ్యవసాయ కూలీలకు పంపకము చేయాలి. ఇప్పుడు అమలాపురం తాలూకాలో కాకిరేనికోనలో 80 ఎకరాలు షాహుకార్లు సాగుచేయకుండ వుంచివున్నారు. అలాగే మన రివెన్యూ మంత్రిగారికి క్రిష్ణాపురంలో రెండువందల ఎకరాలు వేస్టుగా పడివుంది. రాజంపేట తాలూకాలో మంత్రిగారికి మహారాజ శోత్రియము వృధాగా పడివుంది. ప్రభుత్వము యీ బంజరు భూములను తీసికొని బీదలకు యివ్వాలి: రెండు కంపెనీలకు 2 వందల ఎకరాల చొప్పున ప్రభుత్వము లీజ్‌కు యిచ్చింది. వీరు బీద రైతులకు సబ్ లీజ్‌కు యిచ్చి బీదప్రజలను పీడించుచున్నారు. ఇప్పుడు భూస్వాములకున్న బంజర్లు, భూస్వాములు ఆక్రమించిన భూములను వెంటనే ప్రభుత్వము తీసికొని బీదలకు పంపకము చేయాలి. తర్వాత లంకభూము లున్నాయి. క్రిష్ణా, గోదావరి లంకభూములను F. L. C. Society బాగుచేసి 20 సంవత్సరములనుంచి అనుభవించుచున్నారు,

యీా భూములను భూస్వాములు లాగుకొన్నారు. రైతుసంఘాలతరఫున కమ్యూనిస్టులు ఆందోళన జరిపి ప్రభుత్వదృష్టికి తెచ్చినా ప్రభుత్వమేమి శ్రద్ధ తీసికొనలేదు. యీా F. L. C. societies కు వందలాది ఎకరాలు పట్టాలు లేకుండ వున్నవి. ప్రభుత్వము యీా societies కు ఉచితముగా పట్టాలు యివ్వాలని కోరుతున్నాము. ఒక సొసైటీ పన్ను చెల్లించలేదని ఆ మిషతో ఎప్పటినుంచో సాగుచేస్తూన్న భూములను లాగుకొన్నారు. కొత్తపేట తాలూకాలో గొర్తి అనే గ్రామములో పన్నులు చెల్లించ లేదని భూములను లాగుకుంటున్నారు. ప్రభుత్వము యీా లంకభూము లను యీా సొసైటీలకు యివ్వాలని కోరుచున్నాను. ఇక రాజకీయ బాధితుల విషయము చూస్తాము. 10, 12 సంవత్సరములనుంచి బీదలు సాగుచేసిన భూములను రాజకీయ బాధితులకు ప్రభుత్వము దఖలుపరచింది. 10, 12 సంవత్సరములు చెమటోర్చి కష్టముచేసిన బీదప్రజల భూములను లాగుకోవడము చాల అన్యాయము. కొత్తపేట తాలూకాలోని పలివెల అనే గ్రామములో బంజరుభూమిని ఒక రాజకీయ బాధితునికి యిచ్చిన విషయము ప్రభుత్వమువారికి తెలియ జేశాము. రాజకీయ బాధితులకు యిచ్చిన భూములను వెంటనే తిరిగి 10, 12 సంవత్సరాలు కష్టముచేసిన వారికివ్వాలి. వారి పట్టాలను రద్దుచేయాలని నా తీర్మానముకోరుతుంది. అందుచేత మొత్తము బంజరు భూమి సమస్యను పరిష్కరించడానికి ప్రభుత్వము వెంటనే చర్యతీసు కోవాలి. యీావిషయములో గౌరవసభ్యులందరు బంజరుభూములను బీదలకు, వ్యవసాయకూలీలకు యివ్వాలని ఒప్పుకుంటున్నారు. గత ఎన్ని కలలో ప్రతిసభ్యుడు, ఓట్లకు వెళ్ళినపుడు, బీదప్రజలకు బంజరుభూములు సాగుకు యిప్పిస్తామని, పట్టాలు యిప్పిస్తామని వాగ్దానముచేశారు. ఈ బంజరు భూములసమస్య పరిష్కారానికి ఒక కమిటీని వేశారు. ఆ కమిటీ యీా భూములను మార్కెట్ value కు అమ్మాలని చెప్పింది. ఇది ఘోరమైన విషయము, విచారకరమైన విషయము. యీా బంజరు భూములను బీదవ్యవసాయ కూలీలకు ఖరీదుకు కాక ఉచితముగా పంప కము చేయాలని నామనవి. యీా బంజరుభూముల సమస్య వచ్చినపుడు సమాధానాలు చెప్పడము తప్ప దీనిని పరిష్కరించడానికి ప్రభుత్వము ఎంతమాత్రము పూనుకొనలేదు. యీా బంజరుభూముల విషయములో చాల అన్యాయాలు జరుగుతున్నాయి. బంజరు భూములను సాగుచేసు కుంటున్న బీద ప్రజలకు objections పెట్టడము, eviction notices

[Sri G. Nageswara Rao] [25th February 1954

యివ్వడము, 144 సెక్షన్‌లు జారీచేయడము జరుగుతున్నాయి. దీనిని పరిష్కరించడానికి వెంటనే తగినచర్యనే తీసుకోవాలి. బంజరు భూములను మార్కెటు ఖరీదుకు కాకుండ ఉచితముగా బిదరైతులకు పంపకము చేయాలని కోరుతూ గౌరవసభ్యులు యీ తీర్మానాన్ని బలపరుస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

Sri C. V. K. Rao:--I second the resolution.

Sri Vavilala Gopalakrishnaiah:--I move.

In line 3, after the words "(either wet or dry)", add the following.

" and forest lands".

Mr. Speaker:--I now adjourn the House for lunch till 2-15 p. m. The House then adjourned.

(After Lunch 2-15 P. M.)

Mr. Speaker :—There are other amendments; they may be formally moved and seconded.

Sri M. Hanumantha Rao :—Mr. Speaker, Sir, I beg to move:

In line 4 after the words "five or more acres" add the following:

"and lands assigned temporarily to political sufferers who were already owners of land and who were given possession of preoccupied lands."

Sri K. Venkaiah : I beg to second it.

Sri K. Venkaiah : Mr. Speaker, Sir, I beg to move:

For the words "at once and assigned to the landless poor free of market value" substitute the following:

"that the temporary assignments and leases of any Government lands made in favour of political sufferers land-owners of more than 3 acres wet and 6 acres dry the village officers and other Government officers and the pattas issued in their favour be cancelled, that the local landless politicals sufferer be treated on a par with the local landless poor, that all waste lands, unobjectionable tank-bed and drain porambokes, lanka lands and lands in the forests mainly fit for cultivation be assigned free of cost to the landless poor, giving priority to the local poor, to an extent of 3 acres wet and 6 acres dry to each family including the land owned by it;

that the assignments to the landless poor be completed before the close of 1954 and that irrigation facilities and other assistance be granted where necessary."

Sri M. Narayanaswami: I second it.

Sri G. Bapanayya: Mr. Speaker, Sir, I beg to move:

Add the following at the end of the resolution:

(a) "and to assign all assessed, unassessed waste lands and unobjectionable poramboke lands to them who occupied them if they do not possess not more than five acres patta lands.

(b) and to assign all unoccupied assessed and unassessed waste land and unobjectionable porambokes to landless poor.

(c) to convert all forest waste into assessed waste and assign to landless poor.

(d) to cancel all penalties levied on unassessed waste lands, unobjectionable porambokes and forest wastes, that are being cultivated.

(e) all Government lanka lands to be given to F. L. C. Societies."

Sri S. Kasi Reddi:-- I second it.

Mr. Speaker:-- I now call upon Sri G. Rama Rao to move his amendment. (After a pause) As the hon. Member is not present, the amendment shall be deemed to have been withdrawn.

Sri P. Pundarikakshacharyulu:-- Mr. Speaker, Sir, I beg to move:

For the word 'poor' in the heading at the end read as "agriculturists and agricultural labourers",

in line five for the word 'poor' substitute the following: "agriculturists and agricultural labourers"

Sri G. Bapanayya:-- I second it.

Mr. Speaker:-- Sri G. Bapanayya will now speak on his amendment.

Sri G. Bapanayya:- ఈ బంజరుభూమి సాగుఅనే సమస్య చాల కాలమునుండి వస్తున్నది. చాలామంది మేమందరము పేదలకు అప్పులమై పేదలకు భూములను యిస్తామని చెప్పుచున్నారు. ఈ భూములన్ని మేము పరిశీలించి పేదలకు యిస్తామని గౌ. శ్రీ కోటిరెడ్డిగారుకూడా చెప్పారు. మనము వీటిమీద ఒక నిర్ణయమునకు రావలసిన అవుసరం వున్నది,

మొత్తంమీాద, యీా భూములు కొంతమంది 16 లక్షలు అంటున్నారు. కాని రిపోర్టులనుబట్టి చూస్తే దాదాపు 40 లక్షల యెకరాలు బంజరు భూమి వున్నదని తెలుస్తున్నది. కొంతమంది యీాభూములను వంద సంవత్సరములనుండి సాగుచేస్తున్నవారు వున్నారు. కొంతమంది grow more food పద్ధతి క్రింద సాగుచేస్తున్నారు. కొంతమంది పేదలు వీటిని సాగుచేస్తున్నారు. కొందరు పెద్దపెద్ద భూస్వాములుకూడా ఈబంజర్లను ఆక్రమించుకున్నారు. ఈ భూములను ఇదేరికంగా, వ్యవసాయకూలీలకు రాకుండా చేస్తున్నారు. ప్రభుత్వం పేదవారివద్దనుండి యీా భూములను తీసుకుంటున్నది. శ్రీ మద్ది సుదర్శనంగారికి గూడ రెండు యెకరాలు యిచ్చింది. ఈ భూములను పేదవారికి యివ్వకుండా కలిగినవారికే కట్టబెట్టుచున్నారు అని చెప్పుతున్నాను ఇంకా ఊరుకోకుండా యింతవరకు వ్యవసాయకూలీలు చేస్తున్న భూములను. వారికికాకుండా, కలిగినవారికి, కట్టబెట్టుచున్నారు. రాజకీయ బాధితులకు యిదివరకే భూములు వుంటే పేదలు సాగుచేసుకునే భూమిని, వారికి యివ్వటం మంచిదిగాదు. దీని గురించి మేము ఆందోళన చేస్తూనేయున్నాము. మాాజిల్లాలో శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారికి 40 యెకరాల మాగాణి పొలము వున్నది. వారికి చింతలమడుగులో సాగుచేస్తున్న పేదవారి భూమిని యిచ్చారు.

శ్రీ వెంకట సుబ్బయ్యగారు 5 యెకరాలభూమి తీసుకున్నారు. వారికిగూడా భూమివుంది.

మన ఉపముఖ్యమంత్రిగారు గూడా 5 యకరాలు తీసుకున్నారు. ఇదివరకే భూములు వున్నవారికి, పేదలకు కాకుండా, కట్టబెట్టడం భావ్యంగాదు. నేను చెప్పేది ఏమంటే గా॥ శ్రీ సంజీవరెడ్డి గారికి భూమిలేకపోతే మామూలుగా పేదవారితోబాటు వారికిగూడ ఇవ్వవచ్చును. పేదవారికి భూములుఇస్తే వారు బ్రతుకుతారు అంతే గాని కలిగినవారికి ఇవ్వటం మంచిదిగాదని చెప్పుతున్నాను. కాబట్టి గా. శ్రీ సంజీవరెడ్డిగారు, ఈ భూములను వదలటం మంచిదని నేను కోరుతున్నాను. ప్రతివారియొక్క గొప్పతనము స్వంత విషయములలోనే బైట పడుతుంది. ముఖ్యంగా డబ్బువిషయంలో బైటపడుతుంది. అంతే గాని, రాజకీయబాధితులకు భూములు లేనివారికి మధ్యఘర్షణ లేకుండా

తగిన సదుపాయములు ప్రభుత్వంచేయాలని చెప్పచున్నాను. దీనిని గురించి పునరాలోచిస్తామని గౌ. శ్రీ. కోటిరెడ్డిగారు చెప్పారు. ఇంత వరకూ భూములన్నీ వున్నవారికే కట్టబెట్టుచున్నారు. న్యాయంగా పాటు బడేవారికి, బీదవారికి ఇవ్వవలెనుగాని, కలిగినవారికి ఇవ్వగూడదని నా వుద్దేశ్యం మీారందరూగూడా ఆలోచించి ఇది మంచిదిఅని అనుకుంటే support చెయ్యమని కోరుచున్నాను. ఈ భూములను మార్కెట్ రేటుకు అమ్ముతామని ఒక G. O. తీసుకొనివచ్చారు. బందరు తాలూకాలో చాలామంది భూములనుచేస్తున్నారు. ఆ భూములకు విలువ వచ్చింది గాబట్టి ప్రభుత్వం అమ్ముతామని చెప్పచున్నారు. ఈ భూముల ఖరీదు ఇప్పటిధర ప్రకారము వెయ్యో, రెండువేలో వుంటాయి. ఈ భూముల మీాద, ఒక ఆఫీసరునుగూడా వేసి అమ్మకం పెట్టారు. వీరు చెప్పే ఆ హెచ్చుధరలకు, పేదవారు కొనలేరు. ఆ భూములను పాటపెట్టితే డబ్బు వున్నవారు కొనుక్కుంటారు. ఈలాంటి పరిస్థితులలో ఇవి వున్నాయి.

ప్రభుత్వం తరఫున ఇది జరుగుతున్నది. ఆ భూములమీాద పేదలకు occupancy right వున్నదిగాబట్టి, వారికే యివ్వటం మంచిది.

కృష్ణాజిల్లా కొల్లేరు భూములు వరదలు వచ్చినప్పుడు మునిగి పోంగి పోతాయి. వరద తీసినతరువాత తేలుతవి. ఈ భూములనుగూడ పేద వారికి కాకుండా, మిగతావారికి యిస్తున్నారు. పేదల దగ్గరనుండి, ఇవి కాజేసి వారికి భూమిలేకుండా చేస్తున్నారు, ప్రభుత్వం ఈ భూములను ఒక్కొక్కరికి రెండు, మూడు యకరాలుయిచ్చి, పేదవారికి సదుపాయం చెయ్యాలి. పేదవారికి బంజరు భూములను, మూడు సంవత్సరాలు వరకయినా యిస్తే ఎట్టి ఆక్షేపణ లేదు. ప్రభుత్వమునకు శిస్తు వస్తుంది. వందలకొలది యకరాలు, యీారకంగా యివ్వవలసిన అవుసరం వుంది.

(At this stage Sri G. Nagabhushanam occupied the Chair.)

అంతేకాదు, మా దివితాలూకాలో పదివేల ఎకరాల బంజరు ఉన్నది. వాటిని చాలకాలంగా పేదలు సాగుచేసుకొంటున్నారు. వాటిని కొంతమంది భూస్వాములు, 25 ఎకరాలున్నా, 30 ఎకరాలున్నా ఆక్రమించుకొన్నారు. ఈ దివితాలూకాలో ముండ్లూరువారి కుటుం బము అనేది ఉన్నది. వారంతా వీటిని సాగుచేస్తున్నారు. వాళ్లు

[Sri G. Bapanayya] [25th February 1954

చేస్తే ఇంకెందుకు చేయడానికి వీలులేదు. కరణాలుకూడ వారిని అనుస రించుచున్నారు. నమ్మిస్తున్నారు బీదవాళ్లు ఎక్కడైనా చేసినట్లైతే, అది objectionable అని వ్రాస్తారు. ప్రతిచోటకూడ ఈ మునసబులువారే చేస్తున్నారు. కనుక ఈ పరిస్థితులలో కలిగినవారు ఆక్రమించుకొన్నటువంటి భూమిని తప్పనిసరిగా పేదలకు ఇవ్వవలసిన అవసరం ఎక్కువగా యున్నది. అంతేకాదు. లంక భూములు ఉన్నాయి. ఇవికూడ చాలా ఎక్కువగా ఉన్నాయి. ఇవన్నీకూడ వ్యవసాయకూలీలు ఈ Tenants Co-operative Societies ద్వారా సాగుచేసుకొంటూ ఉంటారు. కాని గుంటూరు జిల్లాకలెక్టరు ఎకరానకు రు 70-0-0 ఇస్తేగాని అవి చేయుటకు వీలులేదని ఉత్తర్వుచేశారు. ఇదివరకు, ఏ నాలుగు రూపాయలో ఆరు రూపాయలో ఇస్తూ చేసుకొంటూయుండేవారు. వాళ్లు ఇంతడబ్బు ఇచ్చుకోలేరు. ఈరకంగా వాళ్లకు అభివృద్ధిలేకుండా పోతున్నది. ఇదే విధంగా కృష్ణ లంకలలోను గోదావరి లంకలలోను అనుసరిస్తున్నారు.

బందరులో ఒక కరణము, అక్కడ 4, 5 వేల ఎకరాల భూమి ఉంటే లంచాలు తీసుకొంటూ, ప్రజలందరికి మీకు బంజర్లు ఇస్తాము అని, ఒక్కొక్కరివద్ద, పదిరూపాయలు, 25 రూపాయలు ఈ విధంగా తీసుకొన్నారు. ప్రతిచోట ఈవిధంగాచేస్తున్నారు. కనుక తప్పనిసరిగా ఈ పేదలకు ఏదోఒకమార్గము చూపి భూమిపంపకం చెయకపోతే ఈ పేదవ్యవసాయకూలీలు, రైతులు చాలా చిక్కులకు, తగాదాలకులోను కావలసివస్తుంది. భూములలోకూడ పంటలుపాడైపోతాయి. అందుచేత త్వరగా ప్రభుత్వము ఈ విషయంలో శ్రద్ధవహించి పరిష్కారం చేయవల సిన అవసరమున్నది.

తరువాత, ఈరోజున జమాబందీలు జరుగుతున్నాయి. చాలా మంది వ్యవసాయ కూలీలు భూములు చేస్తున్నారు. చాలా objectionable అయినవి కాకుంటే unobjectionable పోరంబోకులు abandoned tanks పెద్దడొంకలు తప్ప, ఇవి ఏమి రహదార్లుకాదు. మరేమీకాదు. వీటిలోచేసుకొని యుంటున్నారు. ఇందులో కలిగినవారు చేసినమట్టుకు unobjectionable lands అని, పేదలు చేస్తేమట్టుకు objectionable అని వ్రాసి అరకంగా పెనాల్టీలు వేస్తున్నటివంటి విషయాలు చాలా ఉన్నాయి. ప్రభుత్వము ఈరకంగా పేదలవద్దనుంచి తప్పు వసూలు చేయడం మంచిదికాదు. ఈ పెనాల్టీలు తప్పనిసరిగా తీయాలి, తరువాత, భూములను స్వయముగా చేస్తున్నటు

వంటి వారికి ఈ బంజరుభూమి ఒక plan ప్రకారం, దానిలో, ఎవరైతే ఇదివరకు ఆక్రమించుకొని, 5 ఎకరాల భూమి కూడ లేకుండా ఉంటారో, వారికి preference ఇస్తూ. 5 ఎకరాలు, 3 ఎకరాలు ప్రకారం ఇవ్వవలసి యుంటుంది. అదేవిధముగా ఆ చుట్టుపక్కల భూమి లేనటువంటి పేదలకుకూడ ఏదో ఒక విధముగా కొంత భూమి ఇవ్వవలసిన అవసరమున్నది. అంతేకాకుండా, ఈ బంజరు ఏయే తాలూకాలో ఏయే జిల్లాలో ఎంత ఉన్నదో లెక్కలు తీసికొని వాటిని అక్కడున్న పేదలకు ఇవ్వటానికి ప్రయత్నించాలి. ముందుగా ఈ రాజకీయ బాధితులకు ఆట్టిపెట్టినవాటిని తీసివేసి బంజరులను పేదలకు ఇవ్వాలి. తరువాత ఇప్పుడు forest లెక్కలలో ఉండి, forest గా లేకుండా ఉన్న వాటిని పేదలకు ఇవ్వాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri K. Venkaiah :—అధ్యక్షా, ఈ బంజరు సమస్య మద్రాసు రాజధానిలో మనం ఒకసారి అక్కడ అసెంబ్లీలో చర్చించాము. ఇక్కడకూడ అది నిత్యసమస్యగా మన అసెంబ్లీలో వస్తున్నది. కాని దీని ప్రాధాన్యతను మాత్రము ప్రభుత్వము పూర్తిగా గమనించినట్లు కన్పించడంలేదు. మన రాష్ట్రములో దీనిని ఒక చిన్న సమస్యగా తీసుకోవడానికి వీలులేదు. ప్రభుత్వపు లెక్కలప్రకారం బళ్లారిజిల్లాను వదలిపెడితేకూడ, 31 లక్షల 40 వేలకు పైగా cultivable waste అంతా సాగుచేయడానికి వీలైన బంజరు వున్నదని ప్రభుత్వ లెక్కలలో ఉన్నది. ఇదిగాక ఇక forests లో ప్రత్యేకంగా సాగుకు లాయకైన బంజరు, ఇతరత్రా ఉండేటటువంటి బంజరు చాలా వున్నది. ఇక పోరంబోకులుగా వుండి, ఇప్పుడు సాగుచేస్తున్నటువంటివి దాదాపు ఒకలక్ష, అరవై యైదువేల ఎకరాలదాకా వున్నాయి. వాటిమీాద penalty వేస్తున్నారు. ఆరకంగా మొత్తం రాష్ట్రంలో 40 లక్షలకు ఏపరిస్థితులలోను తగ్గకుండా బంజరు వున్నది. మా జిల్లాలో ఈ forests లో అదనంగా బంజరు వున్నదని పూర్వమునుంచి ఆ ప్రజలు అంటున్నారు. సత్తెనపల్లి తాలూకాలో అధికారులు విచారిస్తే 50 వేలు ఎకరాలు సాగుకులాయకయ్యే బంజరు వున్నదని తెలిసినది. అదేవిధంగా వినుకొండ తాలూకాలో 20 వేల ఎకరాలు. పల్నాడు తాలూకాలో 20 వేల ఎకరాల బంజరుఉన్నది. ఇది reserve forest అని వ్రాసినప్పటికినికూడ, అక్కడ ఒక చెట్టుకూడ లేదు. మా బాపట్లతాలూకాలో

[Sri K. Venkaiah] [25th February 1954

10, 15 వేల ఎకరాల బంజరు ఉన్నదనేది వాస్తవము. ఈలాంటివి సాగులోనికి తీసుకురావడానికి అభ్యంతరం ఉండనవసరంలేదు. ఇప్పుడు సాగులో ఉన్నటువంటి వాటినిగురించి విచారించినట్లైతే, మాజిల్లాలోని అనుభవమునుబట్టిచూస్తే, లక్షఎకరాలు బంజరు సాగులోఉంటే, 50 వేల ఎకరాలకు పైగా, ఈ భూస్వాముల చేతుల్లోను, గ్రామాధికారుల చేతుల్లోను, రాజకీయ బాధితుల చేతుల్లోను ఉంటున్నవి, ఈ విషయములో ప్రభుత్వలెక్కలు కొంచెం గమనించినట్లైతే, తెలుస్తుంది. ప్రభుత్వము ఆ వివరాలు సేకరించలేమని, ఇది అనవసరమైన ఖర్చు అని సేకరించడంలేదు. అయినా 40, 50 వేల ఎకరాల పైగా ఈ పెద్దవాళ్ళ చేతులలో ఉంటున్నవని చెప్పవచ్చును. మాజిల్లాలో జె. కుప్పుస్వామి చౌదరి అనే ఆయన పెద్దభూస్వామి. ఆయనకు 8 వందల ఎకరాలు 99 సంవత్సరాలకు, కౌలుకు ఇచ్చారు. అదేరకంగా కొవ్వేటి యార్లగడ్డ రంగనాయకులు అనే పెద్ద వడ్డీవ్యాపారస్తుడున్నాడు. ఇలాంటి పెద్ద భూస్వాములకు 8 వందలు, 10 వందల ఎకరాలు బాగా సాగు అయ్యేటటువంటి భూమి, 99 సంవత్సరాలువరకు కౌలుకు ఇచ్చివేసినారు. ఈ మధ్య ప్రకాశంపంతులుగారు బాపట్లవచ్చినప్పుడు, ఈవిషయను ప్రస్తావించినారు. తరువాత, చంద్రమౌళి అనే రంగుల వ్యాపారి ఉన్నాడు. ఆయనకు కనుపర్తిలో 8 వందల ఎకరాలభూమిని ఇచ్చారు. దానికి తోడుగా 9 వందల ఎకరాలు 99 సంవత్సరాల వరకు ఆయనకు ఇప్పచెప్పారు. ఇక ఒంగోలు తాలూకాలో ధారా గోపాలశాస్త్రి అనే ఆయనకు ఇదివరలో ప్రకాశంపంతులు అధికారంలో ఉండినప్పుడు, అదివరకు సాగుచేస్తున్నటువంటి వ్యవసాయకూలీలను బయటకు నెట్టివేసి చెరుకమ్మపాలెంలో పొగాకుపంట నేర్పించడానికి 25 వేల ఎకరాలు 33 సంవత్సరములవరకు కౌలుకు ఇచ్చేశారు. ఒకవైపున ఈవిధంగా జరుగుతూయుంటే రెండవవైపున రివిన్యూబోర్డు Standing Orders లో గ్రామాధికారులు, ఎవరూకూడ బంజరులు ఆక్రమించుకోకూడదని నిషేధించి యున్నారు. ఆనిషేధము అట్లాగే ఉండనేఉన్నది. కాని ఆచరణలో గ్రామాధికారులు అనేకగ్రామాలలో తాము స్వయముగా పట్టాలు తీసికొనిగాని లేక మధ్యవర్తిదళారీలకు పట్టాలిప్పించి తరువాత transfer చేయించుకొనిగాని, స్వాధీనము చేసుకొంటున్నారు. ఆవిధంగా అడవలదీవి కరణం 135 ఎకరాలను, బాపట్ల కరణం కొంత భూమిని దళారీలు ద్వారా

[illegible]

25th February 1954] [Sri K. Venkaiah]

బాపట్ల కర్ణంగారు ఆ చుట్టుపట్ల భూమి అంతకూడా కాజేశారు. దానిని తన భార్యపేర కొంత, తమ్ముల పేర కొంత, యీ విధంగా ఎంతో భూమిని అనుభవించు కొంటున్నారు. మిత్రులు శ్రీకృష్ణగారు యిదివరకు యీ నరసాయపాలెంలోని భూమి తగాదాలు యీ ఎసెంబ్లీలో ఎన్నో పర్యాయాలుగూడ తమ దృష్టికి తెచ్చియున్నారు. అవూరి గ్రామకర్ణము మునసబులు యిద్దరుకలిసి 4 ఎకరాల సుక్షేత్రమైన మాగాణిభూమిని ఆక్రమించుకొని అక్రమంగా అనుభవించటానికి తలపెట్టుతున్నారు. రివిన్యూబోర్డు Standing Orders కు వ్యతిరేకంగా రివిన్యూ ఉద్యోగస్తులను, పోలీసు ఉద్యోగస్తుల సహాయ్యముతో జబర్దస్తీగా పేదవాళ్లను ఆభూములలోనుంచి తరిమివేస్తూ, వాళ్లమీద 144 వ శెక్షను ప్యాసుచేయించి అక్రమకృత్యాలకు దిగి అనుభవించుచున్నారు. Sub Collector గారు యీ తగాదాల విషయంలో తీర్పు కూడా యిచ్చారు. పేదవాళ్ల చేతులలోనుంచి యీ భూములను లాగుకొని యీ గ్రామమునసబులు ఆక్రమించుకున్నారు. కొంతభూమిని యిళ్ల స్థలాలక్రింద అమ్ముకొంటున్నారు. ఈరకంగా ముఖ్యంగా మా గుంటూరు జిల్లాలో అనేకమైన భూములు అక్రమ ఆక్రమణలో వున్నవి. ఈగ్రామాధికారులవద్ద ఎంతభూమివున్నదిన్నీ బైటికిచెప్పరు.

ఇక రాజకీయబాధితుల విషయం చూడండి. సుమారు నాలుగువందలమందిని రాజకీయబాధితులు అనేపేరుతో మాజిల్లాయందలి రొంపేరు ప్రాంతంలో భూములు సాగుచేసుకొనుచున్న బీదవాళ్ళపైకి తోలారు. వారిని విపరీతంగాబాధిస్తున్నారు. ఈ బీదవాళ్ళమీద రోజుకు ఒకకేసు పెడుతున్నారు. పోలీసుల సలహాలతోను, సహాయముతోను యీ బీదలను arrest చేయించుచున్నారు. కొంతమంది అరెస్టు అయినప్పటికిని వాళ్లు ఆ భూములను అంటిపెట్టుకొని వుంటున్నారు. ఈ రొంపేరుక్రింద ఎన్నో వేల యకరాలు సాగుకు లాయకీఅయినటువంటిభూమివున్నది. ఈ భూమి నంతయును భూమిలేని పేదవాళ్ళకు యిస్తే, పేదలు బ్రతుకుతారని నా అభిప్రాయము. భూములున్నవారే, పేదవాళ్ళ నోళ్ళ గడ్డకొట్టి, గ్రామ కర్ణము, మునసబులు ఒకవైపున ధనికవర్గమున చెందిన మోతుపరి ఆసాములు మరొకవైపున, యీ రాజకీయబాధితులు, పోలీసులు యింకొక వైపున యీ బీదవాళ్ళను బాధిస్తున్నారు. కాబట్టి యీ రొంపేరు భూములకు స్థానికంగా ఒకబిల్లును తెచ్చి యీ పేదవాళ్ళకు సహాయపడాలంటాను. కొద్దోగొప్పో భూములున్నవారు కొందరు ఈ భూములకు

సంవత్సరం పిటీషను పెట్టారు. మురుగుపోకుండా వాగునుపూడ్చి గదిమి వేస్తున్నారు. బీదలను ప్రక్కకు చేరనివ్వలేదు. ఇదంతా అక్రమమని పిటీషనుపెట్టారు. ఇన్ని అక్రమాలు చేస్తూంటే, ఏచట్టము అడ్డమురాలేదు. తహాశ్శీలుదారు గాని, రెవిన్యూ యిన్స్పెక్టరుగాని ఆవిషయము పట్టించుకోరు వాళ్ళకు కొంచెము డబ్బుయిస్తే, వాళ్ళు దాని జోక్యానికిపోరు. ఈ రకంగా గ్రామాధికారులు, భూస్వాములు మన ఆంధ్రరాష్ట్రములో వేలకొలది, లక్షలకొలది ఎకరాలు ఆక్రమించు కొని బయటపడకుండా అనుభవించుచున్నారు. ప్రభుత్వము ప్రత్యేకశ్రద్ధ తీసుకుంటే, అన్నివిషయాలు తేలగలవు. రాష్ట్రము మొత్తముమీద చూస్తే, సుమారు నలభై లక్షల యకరాలలో గమనింప దగ్గంతభూమి భూస్వాములవద్ద, యింక యితర పెద్దలదగ్గర వుంటున్నది. నీటిసరఫరావుంటె యిసుకప్రాంతము కూడా బాగుగా పండుతుంది. ఇది అనుభవజ్ఞులు చెప్పేవిషయం. పేదలు సాగుచేసే భూములు లాగుకోవడము వల్ల, పేదలు చాలా తహతహ పడుతున్నారు. నాలుగు అయిదు సంవత్సరాలుగా వ్యవసాయకూలీల ఆర్థికస్థితి దిగజారిపోయింది. అందువల్ల పేదవాళ్ళు బ్రతుకటానికి దారి లేక విపరీతంగా దూరప్రాంతాలకు వలస వెళ్ళడం జరుగుచున్నది. ముఖ్యంగా యీ బీదప్రజల జీవనోపాధి సమస్య కర్నూలు, నెల్లూరు జిల్లాలలోనేగాక మాగాణీ ప్రాంతములో కూడా ముందు కొస్తున్నది. జీవించాలంటే అప్పులకు పోవలసివస్తోంది. మాగాణీ ప్రాంతంలోకూడా వడ్డీలు విపరీతంగా పెరిగాయి, బస్తాకు అరబస్తానాముపుంది. పేదవాళ్ళు, ఏ ఆధారములేని వాళ్ళు పొట్టచేతపట్టుకొని ఎంతదూరము పోగలరో ప్రభుత్వము గుర్తించాలి. వ్యవసాయకూలీలకు ఒక ఎకరమో, రెండు ఎకరాలనో యిచ్చేటట్లు అయితే, అది ప్రజాస్వామికమునకు పునాదిగా యేర్పడుతుంది వ్యవసాయకూలీలు నిత్యము అగచాట్లుపడే పరిస్థితులున్నపుడు ప్రజాస్వామికము నిలవదు. గతపంచాయితీ యెన్నికలలో బీదలు భూస్వాముల దబాయింపులకు గురికావలసిరావటమే ఇందుకు నిదర్శనం. వ్యవసాయకూలీ కుటుంబాలకు ఏదోకొంత జీవనాధారము కల్పించితేగాని, వాళ్లకు కష్టాలు తొలగవు. యిప్పుడు ప్రభుత్వము తల పెట్టే భూమిపంపిణీవిషయములో ముందు, యేఆధారము లేని పేదవాళ్లకు యీభూములుపంచి పెట్టాలని, ప్రజాస్వామికానికి పునాదియేర్పరుచుటకు పూనుకోవాలని కోరుతున్నాను. రొంపేరు ప్రాంతంలో సుమారు 8 వేల

యకరాలు ఆక్రమణలోవుంది. దానిలో 6 వేల యెకరాలు అయిదారు వేల కూలీ కుటుంబాల ఆక్రమణక్రిందఉంది. ఈ అయిదారువేల కూలీ కుటుంబాలేగాక, భూస్వాములుకూడా ఆక్రమణదారులలో వున్నారు. అటువంటి వాళ్లనందరిని మినహాయిస్తే, తక్కినవారిలో ఒక్కొక్క బీద కుటుంబానికి ఒక ఎకరమో అరఎకరమో గూడా సాగుచేస్తున్నవారున్నారు. ఇందులో కొంతమంది కొద్దోగొప్పో భూమి వున్నవారి భూమిని సాగుచేసుకొని జీవించేవారుకూడా వున్నారు నల్లమడవాగు ప్రాంతంలో 10, 15 సెంట్లు భూమినిగూడా 20, 30 సంవత్సరాలనుంచి సాగుచేసుకొనేవారు వున్నారు. ప్రతిసంవత్సరము వారికి eviction notice ఇవ్వడం penalty వేయటము జరుగుచున్నది. గ్రామోద్యోగస్థులు వాళ్ళను యిబ్బందులపాలు చేస్తున్నారు. అయినప్పటికి సాగుచేస్తూ ఆ ఆదాయమును కూలికి తోడుచేసికొని, యీకూలీలు జీవిస్తున్నారు. ఇట్టివాళ్ళందరికి అధారం కల్పించటానికి యీ నలభై లక్షల యకరాలు సాగులోనికి తీసుకొనిరావాలంటె, యిప్పుడువున్న బీదలకు పట్టాలు యివ్వాలి. ప్రభుత్వానికి అవసరమని వినియోగమవుతుందని అనుకుంటే, అది tank bed కానివ్వండి, వాగులుకానివ్వండి, పోరంబోకులు కానివ్వండి అవసరమైనపుడు తీసికొనే అవకాశముంచుకొంటూ బీదలకు కౌలుకివ్వండి. అవసరమని ప్రభుత్వము నిర్ణయించుకొంటే, అప్పుడు ప్రభుత్వం తీసుకోవచ్చు. ఆభూమి బీదలకుయిస్తే, వాళ్ళకు జీవనానికి అధారముఏర్పడుతుంది. నిజముగా యీ నలభైలక్షల యకరాలు 8 లక్షల కుటుంబాలకు ఒక్కొక్కకుటుంబముకు అయిదుఎకరాలు వచ్చే అవకాశం వుంటుంది. అంటే 40 లక్షలమందికి, కుటుంబానికి 5 గురు చొప్పునచూస్తే భూవసతి కలుగుతుంది. ఈ రాష్ట్రములోవున్న జనాభాను బట్టి నలభైలక్షలమంది ప్రజలు తక్కువకారు. సక్రమంగా చూస్తే యింకను ఎక్కువమందే వున్నారు. ఆరకంగా ఆభూమిని సక్రమపద్ధతిలో పంచగలిగితే ప్రజలలో ప్రశాంతము కలుగుతుంది. ప్రభుత్వం యీనాడు రాష్ట్రములో పొట్టకొరకు ఎదురుచూచే బీదసాదలు భూమికొరకు తహతహపడే రోజులలో యీ భూమిని పంచిపెట్టి వాళ్ళకు జీవనాధారము కలిగించి ప్రజాస్వామ్యమును ముందుకు తీసుకొనిపోవటానికి వీలవుతుంది. కాబట్టి ప్రభుత్వానికి ప్రజాస్వామికముపైన విశ్వాసమువుంటే యీతీర్మానములో పొందుపరచిన యీ పద్ధతిని ఆమోదించడం ధర్మమని చెబుతూ యింతటతో [illegible]న్నాను.

25th February 1954]

Sri Vavilala Gopalakrishnaiah :—అధ్యక్షా, ఈనాడు బంజరు భూములు ఆంధ్రదేశానికి మొత్తముమీద లెక్కపెడితే గవర్నమెంటు లెక్కల ప్రకారముగా 35 లక్షల ఎకరాలుఉన్నదని తేలుతున్నది. కాని యీ లెక్కలుకాకుండా, యింకను forest బంజర్లువున్నవి. అసలు ముఖ్యమైన అడవులు కొట్టి పారవేస్తూవుంటే మాట్లాడడం లేదుకాని, చిన్న forests అన్ని అభివృద్ధికావలెనని చెప్పుతూ, forest banjars సాగుచేయటానికి వీలులేదు అని అంటున్నారు అడవులు పెంచవలసినదే. దాన్ని ఏవరూ కాదనరు. అయితే యీపరిస్థితులలో యివ్వటానికి వీలుంటుందా? వీలులేక అడవులు పెంచేటట్లైతే ప్రభుత్వానికి వుంటవి. కాని దీనివిషయంలో ఒక సంగతి చెప్పవలసియున్నది. అడవులు పెంచటానికి యీస్థలం అంతా కొండల ప్రక్కనేవుంటున్నవి. పెద్దచెట్లు పెంచితే, వాటివేళ్ళు చుట్టుప్రక్కల చాలాదూరము ప్రాకును. చిన్న చెట్లువేస్తే, వేరు దూరముపోజాలదు. అటువంటిచోట భూమి సాగుకు యిచ్చినట్లైతే, వరిగ, కొర్ర మున్నగు వాని సాగుకు వుపయోగపడును. రాయివున్నచోట చెట్లుపెరగవుకాని వరిగ పెరుగుతుంది. Forests కోసము అనేపేరుతో రిజర్వుచేసినందువల్ల సామాన్యపేదరైతాంగానికి ఆ భూమి సాగుచేసుకోటానికి వీలులేకుండాపోతుంది. ఆవిధంగా ప్రతితాలూకాలో కూడా చాలా భూమివుంటుంది. మా సత్తెనపల్లి తాలూకా సంగతి వచ్చినప్పుడు 11 సంవత్సరాల క్రిందట వ్యవసాయం కోసం అడవిలో సర్వేచేయించిన దాదాపు 8 వేల యకరాలు భూమి సాగుకు యివ్వమని కలెక్టరును అడగగా, ఆభూమి నిలవవుంచగలమని చెప్పాడు. దానికి సంబంధించిన ఆరిపోర్టు యిప్పుడు పోయిందని అంటున్నారు. ఇటువంటివి యింకను చాలా భూములువున్నవి. ఈ forest policy అంతయుచూస్తే అనేక అభ్యంతరాలతో కూడివున్నది. ప్రభుత్వ లెక్కల ప్రకారం ఇప్పుడే 35 లక్షల యకరాలభూమి కాకుండా గ్రామాలకు ఆనుకొనివున్న భూములు 60, 70 లక్షల యకరాలభూములు సాగుకు లాయకీ అయినవి అనేకచోట్ల వున్నవి. రైతులు యీభూములను చాలాచోట్ల ఆక్రమించుకొనివున్నారు. ఇదంతయు ప్రభుత్వ లెక్కలలోనికి రావటానికి వీలున్నది. కాని దానికి దగ్గర బీడులు లేవు. ఇప్పుడు గుంటూరుజిల్లా తీసుకుంటే చాలావరకు బంజరుభూములు రైతుల ఆక్రమణలోవున్నవి. స్పీకరుగారికి యిద్దామనుకొన్న పిటీషను మంత్రిగారికే యిచ్చాను. ఒక భూమివిషయంలో ఆక్రమంగా ప్రభుత్వం

[Sri Vavilala Gopalakrishnaiah] [25th February 1954

పన్నులు వేస్తున్నారు. ఆభూమి 25 సంవత్సరాలుగా వ్యవసాయం చేస్తున్నారు. పన్నులు, పెనాల్టీలు వేసినప్పటికి అవి యేదో విధంగా ప్రభుత్వానికి చెల్లించుకుంటున్నారు. పెనాల్టీ యివ్వటానికి సాధ్యం కాకుండావున్నది. అది అదృష్టవశాత్తు మాగాణిభూమి అయింది. ఇప్పుడు అక్కడి అధికులు అభ్యంతరాలు పెట్టుట ప్రారంభించారు. పెనాల్టీ కట్టలేకపోతే అందులో వచ్చిన పంటసుమారు 30, 40 బస్తాలు ఆక్రమణ భూమి అనే పేరుతో ప్రభుత్వంతీసుకున్నారు. ఈవిషయం క్రోసూరు అనే గ్రామంలో జరిగింది. ఆభూమి ఒక Christian స్త్రీ స్వాధీనములో వున్నది. ఒక రాజకీయ బాధితుడు అట్లాంటిపొలం తీసుకుంటే, అప్పటి కష్టం ఆర్డరు యిచ్చారు.అందులో వచ్చే ఆదాయం మాత్రమేఆయనకు వస్తున్నది, అనుభవిస్తూయున్నాడు. ఇంకొకపొలం నందిరాజు పాలెం చెరువుకు చేరినది. కర్ణంగారు ఎవరిపేరో వ్రాసి అక్రమంగా ఆయన స్వాధీనంచేసుకున్నాడు.

ఇక శివాయిజమాభూములున్నవి. ప్రక్కనవున్న రైతులు యీభూములను ఆక్రమించుకోవడం జరుగుచున్నది. ఇందులో వున్న ప్రధానవిషయం యేమిటంటే అయిదుఎకరాల భూమికి పైనవున్న వారిదగ్గరనుంచిభూమి ప్రభుత్వం స్వాధీనంచేసుకొని-పేదరైతులకుఇవ్వాలి. వారికి వున్న భూమివిషయం కాదు, అదనంగా అధికారంలేకుండా సాగుచేసుకొన్న భూమి విషయం-పేదప్రజానీకము యొక్కడైన భూములు సాగుచేసుకొంటూంటే, బలవంతులైన రైతులు వాళ్ళను తొలగించి ఆ భూములు కాజేస్తున్నారు. ప్రభుత్వము యీనాడు బంజరు భూములను పేదవాళ్ళకు పంచుతామని అంటున్నారు. వాళ్ళను బలవంతులు దబాయించి పొలములాగుకుంటే వాళ్ళకు జీవనము ఎట్లాగో ప్రభుత్వం గుర్తించాలి. ఈపేదవాళ్ళు ప్రభుత్వము వారి అధికాహారోత్పత్తిస్కీముక్రింద సాగు చేసుకుంటున్నారు. ఈ స్కీము క్రిందనైనా పేదవాళ్ళకు అయిదు ఎకరాలకు తక్కువలేకుండా యిస్తే బాగుంటుంది. ఈ భూములను యిచ్చేటప్పుడు Co-operative విధానంక్రింద యిస్తే మంచిది. ఈ Co-operative విధానంలో గూడా సాగుచేయటానికి కష్టముగావుంటుంది. ఒకవేళ యిచ్చినను అందులో పండే పంట వాళ్ళకుచెందే విధానము ఏర్పరచాలి. పేదవాళ్ళకు యిచ్చే బంజరుభూములను ప్రభుత్వం సగమువేలము వేస్తామంటున్నారు. పేద ప్రజానీకానికి పోటీగా ధనవంతులు, పేదవాళ్ళవల్ల బాగా తయారైన [illegible] ఎకరం ఒకటికి వెయ్యి, 15 వందలవరకు పాటపాడుకొని తీసు

కుంటారు. అటువంటి సందర్భములో యీ పేదవాళ్ళకు భూమి ఎక్కడి నుంచి రాగలదంటాను. ఈ వేలము ప్రభుత్వము ఎందుకు పెట్టాలి అని నాఉద్దేశ్యము. పేదరైతాంగం భూములు వేలంలో కొనటానికిపీలుండక, ఆభూములు వదులుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది కాబట్టి పెదవాళ్లకు యీ భూములు పాట లేకుండానే యివ్వాలి. వేలంపెట్టి భూములను అమ్మితే ప్రభుత్వానికి ఆదాయము వస్తుందని ఆలోచించవచ్చు. ఈ విషయంలో Sri B. S. Murthi గారు ఒక సలహాయిచ్చారు. సగము వేలమువేసి, సగము బీదవాళ్ళకు యివ్వాలన్నారు. అది ఆచరణలో పెట్టినా నష్టమేవస్తుంది. కాబట్టి పేదవాళ్లు సాగుచేసుకొనే పొలం వాళ్ళకే విడిచి పెట్టాలంటాను. ఆప్రకారము ప్రభుత్వం ప్రకటించాలి.

ఇక మూడవ విషయం మనవిచేస్తాను. Objectionable and unobjectionable భూములు ఏవో ప్రభుత్వం ఆలోచిస్తామని అంటున్నారు. వేలము పెట్టితే, యిప్పటికి 15, 20, 30 సంవత్సరాలుగా సాగుబడికి తెచ్చిన పొలాలు యీనాడు ధనవంతుల చేతులలోనికి పోగలవు. అటువంటప్పుడు భూములను పేదవాళ్ళకు పట్టాలకు యిప్పుడే యిచ్చివేస్తే బాగుంటుంది. ఇప్పుడువున్న 40, 50 లక్షల యకరాలున్నూ 10 లక్షలమందికి పంపకముచేస్తే పేద ప్రజానీకం బ్రతకటానికి ప్రభుత్వం వీలు కలుగజేసినవారవుతారు. దీనిని రాజకీయాలతో ముడిపెట్టవద్దు. బంజరుభూములను ఎక్కువమంది భూస్వాములు ఆక్రమించి సాగుచేసుకొంటున్నారు. ఆభూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకొని, వాటిని పేదప్రజలకు పంచియివ్వాలి. ఒక్కొక్క పేదరైతుకు 5 ఎకరములకంటే ఎక్కువ యివ్వకూడదు. ఎక్కువుంటే వాళ్ళదగ్గరనుంచి తీసేసుకోవాలి. బంజరుభూములను ఇంతవరకు చేసుకొంటున్న బీదవారికి యివ్వవలసి ఉంటుంది. జిల్లాలోని బంజరుభూములను జిల్లాకలెక్టరులద్వారా అచ్చట నున్న బీదప్రజలకు యిప్పించాలి. ఒక్కొక్కరికి 5 ఎకరముల భూమి మాత్రమే పంచిపెట్ట వలయును. ఇపుడు కనుక ఎవరైనా 5 ఎకరముల కెక్కువభూమి కల్గిఉంటే వాళ్ళదగ్గరనుంచి ఎక్కువవున్న భూమిని లాగి పారేసెయ్యాలి. ఈ బంజరుభూములను భూస్వాముల వద్దనుంచి, జమీందారుల వద్దనుంచి స్వాధీనం చేసుకొని పేదప్రజానీకమునకు పంచిపెట్టి వాటికి పట్టాలను యివ్వాలి. ఈ బంజరుభూములను బీదవారికి పంచే విషయంలో ప్రభుత్వం ఏ మాత్రం శ్రద్ధవహించునట్లు కనబడదు.

**Sri K. V. S. Padmanabha Raju** :— అధ్యక్షా ! ఇప్పుడు చర్చ బంజరుభూముల విషయం గురించి జరుగుచున్నది. ఈ సమస్యపై అనేకమంది, ప్రతిపక్షసభ్యులు, ప్రభుత్వపక్ష సభ్యులు మాట్లాడారు. వారు ఈ బంజరు భూములను హరిజనులకు, పేద ప్రజలకు, వ్యవసాయకూలీలకు పంచి యివ్వాలని ఉపన్యాసాలిచ్చారు. కాని అసలు బంజరుభూమి ఎంతఉన్నదీ అని ప్రభుత్వం కాని, ఎవరైనా లెక్కలువేశారో, ఏఏ జిల్లాలో ఎన్నిఎకరాల బంజరు భూమి ఉన్నదో ? అసలు ఆ భూమిని అచ్చట ఉన్న పేదప్రజలకు, హరిజనులకు వ్యవసాయ కూలీలకు పంచినట్లయితే ఎంతెంతభూమి వస్తుందో ? అది ఎవరూ ఇంత వరకూ ఆలోచించనట్లుకనిపిస్తున్నది. ప్రభుత్వం బంజరుభూములసమస్యను గురించి ఇంతవరకు ఆలోచించినట్లు కన్పించదు. బంజరభూములను ఇపుడు ధనికులైనభూస్వాములే చాలాభాగం వాడు కొంటున్నారు. ఇప్పుడు దాదాపుబంజరుభూములన్నీ ప్రభుత్వం వారిక్రిందనే వారి ఆధీనంలోనే ఉన్నాయికనుక, అవి ఎన్నివున్నవీ ప్రభుత్వం లెక్కలను తయారుచేయాలి. ఆలెక్కలను తయారుచేసి వాటిని బీదప్రజానీకానికి హరిజనులకు, వ్యవసాయకూలీలకు ఎలాపంచితే వీలుగా ఉంటుందో ప్రభుత్వం ఆలోచించాలి. ఇపుడుఎక్కడైనా బంజరుభూములు ఖాళీగా ఉన్నట్లయితే వాటిని భూస్వాములు ఆక్రమించి దానిచుట్టూ ఏదోగట్టు వేసేసి దాంట్లో మామిడిమొక్కలనో, జీడిమామిడిమొక్కలనో నాటేసి అదొక తోట అని అనడం జరుగుతున్నది. బంజరుభూములు ఖాళీగా ఉన్నట్లైతే వాటిని మాత్రమేహరిజనులకు, బీదలకు, వ్యవసాయకూలీలకు సాగుచేసుకోడానికి sanction చేస్తామని ప్రభుత్వంవారు అంటున్నారు. అందువల్లనేభూస్వాములు, పెద్దపెద్దరైతులువాటిని ఆక్రమించడంజరుగు చున్నది. Forest area లో ఉన్న భూములను ఆప్రాంతప్రజలకు సాగుచేసు కోడానికి యివ్వడంలేదు. నాలుగుకొండలమధ్య అరణ్యప్రాంతం ఉంటే దానిని అనవసరంగా అలాగే అట్టేపెట్టడమో, ఆ భూములను ఆ ప్రాంత ములవారు సాగుచేసు కొంటామని అడిగితే యివ్వకపోవడము, జరుగు చున్నది. చాలాకాలంనుంచి కొంతమంది బీదలు హరిజనులు, బంజరు భూములను సాగుచేసు కొంటుంటే వారిని హఠాత్తుగా తొలగించి వాటిని రాజకీయబాధితులకు యివ్వడం జరుగుతోంది. చాలాకాలంనుంచి బంజరు భూములను సాగుచేసు కొంటున్న బీదలకు, హరిజనులకు వెంటనే వాటికి

25th February 1954] [Sri K. V. S. Padmanabha Raju]

పట్టాలివ్వాలి. ప్రతిజిల్లాలోని బంజరుభూమి ఎన్నిఎకరాలున్నదో ప్రభుత్వం లెక్కవేసి ఆ భూమిని అచ్చటి పేదప్రజలకు, హరిజనులకు పంచి పెట్టాలని మనవిచేస్తున్నాను. బంజరుభూములను సాగుచేసుకోడానికి హరిజనులకు బీదరైతాంగానికి, వ్యవసాయకూలీలకు అనుమతియిచ్చినతరువాత వారికి వెంటనే పట్టాలివ్వవలయును. ఇంకొక విషయమేమిటంటే ప్రతి తాలూకాలోను, ప్రతిజిల్లాలోను, బంజరు భూములు ఎన్ని ఉన్నాయో ప్రభుత్వం లెక్కలు తయారుచేసి, వాటిని ఆయా ప్రాంతములలోని హరిజనులకు, పేదప్రజలకు, వ్యవసాయకూలీలకు మాత్రమే ఒక్కొక్కరికి 5, 6 ఎకరముల చొప్పున పంచిపెట్టవలయును. ఇప్పుడు హరిజనులకు, పేద ప్రజలకు వ్యవసాయకూలీలకు సాగుచేసుకోటానికి బంజరు భూములను యిచ్చిన తరువాత వారికి, పట్టాలివ్వడానికి చాలా ఆలస్యమగుచున్నది. అందువల్ల వాటి ప్రక్కనున్న భూస్వాములు, ధనికులు ఆభూములను ఆక్రమించు కుంటున్నారు. అందువల్ల వారికి వెంటనే పట్టా లివ్వవలయునని కోరుతున్నాను. బంజరు భూములను పేదరైతాంగానికి, వ్యవసాయ కూలీలకు, హరిజనులకు మంజూరు చేయడంతోనే సంతృప్తిపడితే ఏమి ప్రయోజనం ? తింటానికి తిండి, కట్టడానికి బట్టాలేని ఆ బీదప్రజానీకం ఆభూములను ఎలా సాగుచేసుకోగలుగుతారు? వారికి భూమిని మంజూరు చేసిన తరువాత వారు ఆభూమిని తిరిగి ప్రక్కనున్న ఏ ధనిక భూస్వామికో అమ్మేస్థితిలో ఉన్నారు. అందువల్ల ఆ బీదరైతాంగాన్ని ఆ భూములను సాగుచేసుకొనేటట్లు చేయాలి లేకపోతే మరునాడే వాటిని ఇతర భూస్వాములకు అమ్ముకోవడం జరుగుతుంది. ఈ విషయమై ప్రభుత్వం తగుచర్య తీసుకోవలయునని మనవిచేస్తున్నాను. ఇందుకోసం ప్రభుత్వంవారు కో-ఆపరేటివ్ సొసైటీలను ఏర్పాటుచేసి, వాటిలో ఈ హరిజనులను, పేదరైతాంగాన్ని సభ్యులుగా చేర్చి వారికి కొంత సహాయంచేసి అనగా **co-operative basis** మీద, ప్రభుత్వం యిచ్చే **takkavi loans** ను వాటికి యిచ్చి, ఒక్కొక్కరికి 7, 8 ఎకరాల భూమినిచ్చి వారికి సహాయ పడవలయునని కోరుతున్నాను.

**Co-operative Societies** ను స్థాపించి కొంతమందిని కలిపి **units** గావేసి ఒక్కొక్క యూనిట్‌కు 10 లేక 12 ఎకరముల బంజరు భూమిచ్చి వారికి ఆర్థికంగా సహాయపడాలి. ఇలాగ కొంతకాలం కనుక వారికి సహాయపడినట్లైతే వారు తరువాత స్వయంగా వాటిని సాగుచేసు

[Sri K. V. S. Padmanabha Raju] [25th February 1954

కోశానికి పీలవుతుంది. భూములను హరిజనులకు మంజూరు చేసినతరువాత వారికి పట్టాలివ్వక పోవడం మూలాన వారి ప్రక్కనున్న భూస్వాములు వాటిని దురాక్రమణ చేయడం జరుగుతోంది. మా విశాఖపట్టణం జిల్లా పల్లాపురం అనే గ్రామంలో 100 ఎకరముల బంజరుభూమి హరిజనులు సాగుచేసుకొనేవారు. ఆభూమిని ఇపుడు వారిప్రక్కనున్న పెద్ద రైతులు దురాక్రమణ చేశారు. అపుడు వారంతా వెళ్ళి ఇపుడు ఆర్థిక మంత్రిగావున్న శ్రీ విశ్వనాథంగారికి చెప్పకొన్నారు. ఇప్పుడు నేను వారికి ఈవిషయం జ్ఞాపకం చేస్తున్నాను. అపుడు వారు విజయనగరం ఎస్టేట్ Manager ను కలుసుకొని వారితో చెప్పి వాళ్ళ భూములను వాళ్ళకి యిప్పించి సహాయంచేశార. తరువాత యిపుడు వాళ్లు మళ్ళీ ఆ హరిజనులను తరిమివేసి ఆ భూములను ఆక్రమించుకొని సాగుచేసుకొంటున్నారు. ఆరోజున సహాయం చేసినవారు ఈ రోజున ఎందుకు సహాయం చేయడంలేదు అని నేను అడుగుతున్నాను. ఆ భూములను చేసుకొంటున్న హరిజనులకు పట్టాలు యింతవరకుయివ్వడమనేది జరగలేదు. వారికి పట్టాలుకనుక యిచ్చివుంటే ఈనాడు దురాక్రమణ జరిగేదికాదు. కనీసం ఆ హరిజనులకు పట్టాలను యిప్పించడానికైనా శ్రీవిశ్వనాథంగారు వారికిసహాయం ఎందుకు చేయడంలేదు. అందుచేత ఈ విషయమై మంత్రివర్గంవారు ఆలోచించి తగుచర్యలు తీసుకొనగలరని ఆశిస్తున్నాను. మా విశాఖపట్నం జిల్లాలో దాదాపు 80 వేల ఎకరముల బంజరుభూమిఉన్నది. దానిని బీదప్రజానీకమునకు హరిజనులకు పంచిపెట్టి అచ్చట Co-operative Societies ఏర్పాటుచేసి వారికి సహాయపడవలయునని ప్రభుత్వాన్నికోరుతున్నాను. విశాఖపట్టణం జిల్లాలో 80 వేల ఎకరముల బంజరుభూమి ఉన్నదని నేను అనుకుంటున్నాను. ప్రభుత్వంకాని, ఎవరైనాకాని లెక్కలు తయారు చేశారా? తయారు చేసినట్లుగా లేదు. నాలుగకొండల మధ్య అనేచోట 2 వేల ఎకరముల భూమి ఉన్నది దానిని అక్కడఉన్న ప్రజలు సాగుచేసుకుంటామంటే వారికి ఆభూమిని యివ్వడం జరగలేదు. అచ్చటనున్న forest officer కూడా వారికి ఆభూమిని యివ్వడానికి నిరాకరించుచున్నారు. యింతవరకు వారికి పట్టాలు రాలేదు. ఈ విషయమై ప్రభుత్వం ఆలోచించ గలదని ఆశిస్తున్నాను. ముఖ్యంగా ఈ బంజరుభూమిలో ఎక్కువభాగం జమిందారీల ఉంటున్నాయి. జమీందారులు ఫారెస్టుఆఫీసర్సును, influence

చేసి ఆఫారెస్ట్ భూములను వశం చేసుకొంటున్నారు. ఆ భూములను ఆ ప్రాంతములలో ఉండి వాటిని సాగుచేసుకొనేవారికి పట్టాలివ్వాలి. ఈ బంజరు భూములను, వాటిని సాగుచేసుకొంటున్న హరిజనులకు, బీద ప్రజానీకానికి, వ్యవసాయ కూలీలకు పట్టాలివ్వటం మాత్రం జరగలేదు. చాలామటుకు బంజరుభూములను జమీందారులే అక్రమించు కొంటున్నారు. అవి అసలు ప్రభుత్వానివే కనుక వాటిని వెంటనే స్వాధీనపరచుకోడానికి వీలుంటుంది. సాగుచేసుకుంటున్న బీదరైతాంగమునకు కూడా పట్టాలు శులభముగానే యివ్వవచ్చును. అందుచేత ప్రభుత్వం ఈవిషయమై తగు చర్యలు తీసుకోవాలి ఈ విషయమై శాసనసభలో రెవెన్యూ మంత్రిగారైన కోటిరెడ్డిగారు ప్రశ్నకు సమాధానం చెబుతూ ఈవిషయమై చర్యలు తీసుకొంటామని చెప్పారు. ఇంతవరకు తీసుకొనలేదు. వారు ఆ బంజరుభూములను సాగుచేసుకొని పంటలు పండించుచున్నారు. కాని వాటికి యింకా పట్టాలివ్వలేదు. వాళ్లు పట్టాలులేకుండా ఇటువంటి పరిస్థితిలో ఎన్నాళ్ళు ఉండాలి? వాటికి పట్టాలు లేకపోవడం వల్లనే పెద్దపెద్ద భూస్వాములు పేదరైతాంగాన్ని తొలగించి దురాక్రమణ చేయడం జరుగుతోంది అందువల్ల వారికి వెంటనే పట్టాలను యివ్వాలి. వారికి వ్యవసాయమునకు co-operative basis మీదకొన్ని యూనిట్లు, లెక్కలను తయారుచేసి, భూమిలేనివారికి భూమినిచ్చి వారికి వ్యవసాయపు పనులకు సహాయపడగలరని ఆశిస్తూ విరమిస్తున్నాను.

Sri P. Pundarikakshacharyulu:—అధ్యక్షా, బంజరు భూములపై ప్రశ్నోత్తరాల సందర్భాలలోను, బడ్జెట్ సమావేశంలోను అనేకసార్లు ప్రభుత్వానికి ప్రతిపక్షంలోఉన్న సభ్యులు అనేకసూచనలుచేశారు. వాటన్నిటిని గురించి ప్రభుత్వం ఏమిచేసిందో మనకు తెలియదు. Question లకు జవాబులు చెపుతూ చాలా waste lands ఉన్నాయని చెపుతున్నారు. ఈ లెక్కలన్నీ చూస్తే ఇవి కాకుల లెక్కలలాగ ఉన్నాయి. ఏదైనా లెక్కలు అడిగితే లేదండి మీరు తప్పులెక్క వేశారు అని చెప్తారు. నిజంగా ఇంతవేస్టు land ఉంటే ప్రజలకు ఇవ్వడానికి వీరికి ఏమి అడ్డువచ్చిందని నేను అడుగుతున్నాను. ఎస్టేట్లను ప్రభుత్వం రద్దు చేయక పూర్వం Estates land ఎలియనేషన్ ఆక్టు, ఎస్టేట్ ప్రయివేట్ ఫారెస్ట్స్ ప్రిజర్వేషన్ ఆక్టని ఉండేది. ఈ ఆక్టు అలాఉంటే చాలామంది జమీందారులు భూములను ఎలియనేట్ చేసి తమ బంధువులపేర ఉద్యోగస్థులపేర, తాబేదార్లపేర, వారి కిష్టమ్మువచ్చిన వారికి భూములకు ఆ

పట్టాలను ఇంతవరకుకూడా ఇస్తుంటే ప్రభుత్వం ఏమిచేసిందో తెలియదు. అలాగే ప్రయివేట్ ఫారెస్ట్సు ప్రిజర్వేషన్ ఆక్టు విషయంలోకూడా కొన్నిఅడవులను కొట్టించి బంజరుభూములను ఉద్యోగస్థులపేర, బంధువుల పేర కట్టారు. వాటిని ప్రభుత్వంలెక్కలలోకి తీస్కోలేదు. వాటికి సర్వే కూడా కాలేదు. ముఖ్యంగా ఈసర్వే సెటిల్‌మెంట్ ఎంతకాలానికి జరుగుతుందో, ఇది రావణాసురుని కాష్టంలాగ ఎంతకాలం కాలుతుందో తెలియదు. ఈ ఎస్టేట్‌లు abolish అయి చాలాకాలం అయినా ఇంతవరకు సర్వేజరగలేదు. ఇదిజరగడానికి ఇంకో 50 సంవత్సరాలు అయినా చాలదు. పోనీ ఎస్టేట్ మానేజరు దగ్గరకు నాలాంటివాడుగాని గున్నయ్యలాంటివారుగాని పోయి ఆ lands ను పేద హరిజనులకు ఇమ్మని అడిగితే అప్లికేషన్సు పెట్టకముందు సాగుచేసుకొండని చెప్పడం, నిజంగా ఆ land దగ్గరకుపోతే అక్కడ ఉండే పెద్దరైతు ఇది మాపట్టా land అని అనడం జరుగుతోంది. ఈవిషయంలో ఒక నిర్దుష్టమైన కార్యక్రమం ఏదీలేదు. అందువల్ల ప్రభుత్వం వెంటనే సర్వే సెటిల్‌మెంట్ చేయాలని చెపుతున్నాను. తర్వాత valuable lands అంటున్నారు. నేను పాలకొండ తాలూకాలో తిరిగినవాడిని. అక్కడ abandoned tank beds లో cultivated lands ఉన్నాయి. ఆ lands ను పేదరైతులకు సాగుకు ఇచ్చి బాగా తయారుచేసిన తరువాత ప్రభుత్వం, వాళ్ళు సాగుచేసుకోడానికి objections పెట్టి, వాటిని మరొకరికి అంటకట్టడానికి ప్రయత్నం చేస్తున్నదేగాని వేరే ఉద్దేశంకాదని మనవిచేస్తున్నాను. ఇక పెనాలిటీలు విపరీతంగా వేస్తున్నారు. ఏదైనా ప్రభుత్వానికి కొంచం ఖర్చుంటే ఉండచ్చు. చిన్నప్రాజెక్టుగాని, చిన్న ఇరిగేషన్ సోర్సెస్‌గాని క్రొత్తగా నిర్వహించినప్పుడు ప్రభుత్వానికి కొంత ఖర్చుంటుంది. అటువంటప్పుడు ఆ ఖర్చులను ప్రస్తుతం మేము భరించే పరిస్థితిలో లేము. దాన్ని ఎలా భరించాలని చెప్పి, దానికి నేను ఒక సూచన చేస్తున్నాను, అటువంటి సందర్భములో భూములు సాగుకు యిచ్చి ఎకరానికి యింతయని నిర్ణయించి 10 సంవత్సరాలపాటు పట్టాలు ఇచ్చి, ఎకరానికి సంవత్సరానికి అదనంగా ఇంత సొమ్ము ప్రభుత్వానికి కట్టాలని నిర్ణయించి వాటిని వసూలు చేయడం మంచిది. అంతేకాని పేదవాళ్ళు బాగుచేసుకున్న భూములను వాళ్ళనుంచి తీస్కుపోయి ఇంకొకరి చేతిలో పెట్టడంమంచిది [illegible] డబ్బులేదనే కారణంచేత వాళ్ళనుంచి తీసుకొనేకంటె, వాళ్ళకు [illegible], పంపుసెట్టున్నూకూడా సప్లయిచేస్తే, ఎకనమిక్‌గా అన్నీ

వృద్ధి పొందాలనే శ్రద్ధ వాళ్ళంతట వాళ్ళకే కలుగుతుంది. కాబట్టి ఈ valuable lands అనే పేరుతో వాళ్లకు ఇవ్వడానికి ఏ objections చెప్పగూడదని చెపుతున్నాను.

నేను ఒక amendment ఇచ్చాను. ఈ landless poor కు భూములు ఇస్తున్నారు కదా అని ఈ భూముల కోసం చాలామంది applications పెట్టి, ఆభూములను తెచ్చుకొని వాళ్లు మళ్లీ కౌలుకుఇచ్చి వారుకూడా land lords గా తయారవుతున్నటువంటి కౌలుదారులు ఈ పల్లెప్రాంతాలలో ఉన్నారు. అగ్రికల్చర్ లేబరర్సుకి ఈభూములు ఇవ్వడం సమంజసమే కాని వాళ్లు లేకపోతే ఇతరత్రా ఈభూములను ఇవ్వటం సమంజసం కాదని చెపుతూ నేను ఇంతటితో విరమిస్తున్నాను.

Sri Kavali Narayana :—అధ్యక్షా! మనం జిల్లాలవారీగా ఈ భూములను లెక్కచూచుకొంటే కొన్నివేలని, కొన్ని లక్షలని చెప్పుకోడం జరుగుతున్నది 4 రకాలుగా ప్రభుత్వం బంజరుభూములను ఇస్తాం అని చెప్పారు. రాజకీయబాధితులు అంటే ఎలాంటివారు. దేశం కోసం భార్యబిడ్డలనువదలి పాటుపడ్డవాళ్లకు ఈనాడు భూములు ఏమీ లేవు. చదువుకున్నవాళ్ళు పెద్దపెద్దవాళ్ళు ఎస్టేట్స్ ఉన్నవాళ్ళు మాత్రమే ఈనాడు రాజకీయబాధితులు. 1945 వ సంవత్సరం తరువాత జమీందారీఏరియాలలో వచ్చిన కొత్త మోడల్ ముఠావర్గాలు పెద్దమహానాయకులు పెద్దరాజకీయబాధితులైపోయి ఉన్నారు. అది ప్రభుత్వానికి తెలుసు. నిజంగా బాధపడ్డవాళ్లు ఇంతవరకు నోరుమూసుకోవలసిన కారణం ఏమంటే రాజకీయాలలో ఉన్నటువంటి అంతర్ రాజకీయాలు తెలుసుకొని, అన్నీతెలిసిన మన ప్రధానమంత్రిగారు, పెద్దలు ఇక్కడ వున్నారుకదా వారేచేస్తారని ధైర్యం కలిగి ఉన్నాం.

రాజకీయబాధితుడు అంటే లాఠీదెబ్బలుతిని చెట్లక్రిందపడుకుని నానాబాధలుపడి వున్నవాళ్ళలోకూడా, చదువుకున్నవాళ్ళు విద్యాధికులు వున్నారు. వాళ్ళని విడిచిపెట్టి క్రొత్త model రాజకీయబాధితులకు, భూస్వాములకు భూములుయిచ్చారు. 1942 లో నేను రెండుసంవత్సరాలు జైలులోవున్నాను కాని నాకేమీదక్కలేదు. నాప్రక్కనే వున్న పెద్దపెద్ద భూస్వాములకు 5 యకరాలుకాదు పదేసి యకరాలుకూడా యిచ్చారు. మేమీవిషయం ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చినా ప్రభుత్వం గాని కలెక్టర్లుగాని ఏమీ చర్యతీసుకోలేదు. హారిజనులుగాని పేదవాళ్ళు

గాని దరఖాస్తులు పెట్టుకుంటే వాళ్ళకేమీ యివ్వలేదు. ఏ గ్రామంలో ఎంత బంజరుభూమివున్నది, దానిని ఏవిధమైన మానవునికివ్వాలి, ఏ కుటుంబము పెదదిగావున్నది, అది యివ్వవచ్చా, యివ్వకూడదా అనే విచక్షణచేసి ఏయేభూములకైతే దరఖాస్తులు పెట్టుకోవచ్చో తాలూకా కచేరీలలో నోటీసు బోర్డుమీద పెట్టాలి. ఇదివరకువలె ఈ విషయం కరణాలమీద, రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లమీద వుంచితే ఎవరికీన్యాయం జరగదు సరిగదా ఒకరిమీద ఒకరు పిటీషన్లు పెట్టుకోవడము, క్రిమినల్ కేసులు పెరగడము జరుగుతుంది మాజిల్లా పాలకొండతాలూకాలో చితాపురందగ్గర 80 యకరాల బంజరుభూమి హరిజనులకు యివ్వమని దరఖాస్తులుపెట్టుకుంటే అవివారికిచ్చారన్నారుకాని తీరా వాళ్లు భూముల దగ్గరకుపోతే అప్పటికొందరు భూస్వాములు ఆక్రమించుకొనివున్నారు.ఇప్పుడా భూములకు చాలాతగాదాలువస్తున్నాయి. నరసన్నపేటతా॥ మడపాం దగ్గరవున్న బంజరుభూములనుంచి హరిజనులను తొలగించి రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు తహశిల్దార్లుకలిసి స్వాధీనం చేసుకున్నారు. ప్రభుత్వానికి మొర పెట్టుకుంటే వాళ్ళమొర వినేవారెవరు? కాని సమయం వచ్చినప్పుడు తగినవిధంగా బుద్ధిచెపుతారు. వేమరవల్లి గ్రామములో 10 సం॥ల నుంచి సాగుచేసుకుంటున్న హరిజనులను భూమినుంచి తొలగించి ఒక జమీందారుకిచ్చారు. ఈ ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక రెవెన్యూమంత్రి కోటిరెడ్డిగారు చాలామంచివారు, పేదలకు సహాయంచేస్తారు అని చెప్పుకుంటున్నాము. మీదగ్గిరవున్న కాగితాలు తహసిల్దార్లకు కలెక్టర్లకు పంపిస్తే లాభంలేదు. ఏగ్రామంలో ఎంతబంజరుభూమి వున్నది. ఏది సాగుకు లాయకవుతుంది, ఏది కాదు అని చూచి లిస్టులు తయారు చేయించి ఆ భూమిని పేదవాళ్ళకు, హరిజనులకు యివ్వాలి. ఆ యివ్వడంలోకూడా పేదవాళ్ళంటే అనేక రకాలైన పేదవాళ్లు వుంటారు. జీవనాధారంకోసం రెండు మూడు యకరాలు కేవలం వ్యవసాయంమీదే ఆధారపడివున్న పేదవాళ్ళకు యివ్వమని అడుగుతున్నాను. హరిజనులు ఈనాడు బ్రతుకు తెరువులేక వారిజీవితం చాలాకష్టమై పోతోంది. మేము పరాయి పరిపాలనలో జైళ్ళల్లో వుండడమే ఇప్పటికన్నా సుఖంగా వుండేదేమో అనిపిస్తోంది. హరిజనులకు ఏదో సహాయం చేస్తున్నాం అంటారు. ఏమిచేస్తున్నారు! హరిజన్ హాస్టల్సంటారు, అవి ఎవ[illegible]న్నారు. ఎవరో చదువుకున్నవాళ్ళు కొందరువచ్చి వాటినినడుపు[illegible]న్నారు. కాని అందులో పిల్లలకు సరైన తిండిలేదు. ప్రభుత్వం

సక్రమమైన పరిపాలన జరిపించిననాడు మేమంతా రామరాజ్యంగా చెప్పు కుంటాము. సవ్యమైన పరిపాలన జరిపించి హరిజనులకు పేదలకు యివ్వాలని నిర్ణయించండి. మీ కక్షలకు, పార్టీలకు తావివ్వకండి. వారికష్టాలను గమనిస్తే మీరే పార్టీకి చెందినప్పటికి మీకు నమస్కరిస్తారు. లేకపోతే వాళ్ళు ఇక్కడ వుండలేరు. ఇతర దేశాలకు కూడా పోవడానికి సిద్ధంగా వున్నారు. వాళ్ళు చాలా నిరాశ, నిస్పృహ చెందివున్నారు. 8000 రూపాయలు 10 తాలూకాలకు యిస్తే ఏమిసరిపోతుంది? 600 దర ఖాస్తులు పెట్టుకున్నారు. పెద్ద పెద్దస్కీములంటారు, లక్షలు యిస్తామని అంటారు. ఈ డబ్బంతా ఏమయి పోతోందో తెలియదు. నేను చెప్పే విషయాలు ఒక ఆవేదనతో చెప్తున్నాను కాబట్టి ఆంధ్రరాష్ట్రంలో వున్న వాళ్ళు అందరు మానవులేనని భావిస్తారని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri B. Krishnamurty Rao:—అధ్యక్షా, ఈ తీర్మానం చదివితే బంజరు భూములను పేదరైతులకు మాత్రమే యివ్వవలసినదనివుంది. కేవలం బంజరు భూములనే యివ్వవలసినదని కోరితే కష్టంలేదు. అవి యివ్వడం కూడా చాలాసులభం. తీర్మానంలో కేవలం బంజరు భూములను మాత్రమే యివ్వవలసినదిగా వ్రాశారు. కాని మాట్లాడేటప్పుడు మాత్రం ఏయేభూముల్ని ప్రభుత్వం యివ్వకూడదని చెప్పిందో ఆటువంటి భూముల్ని కూడా వారు 20 సంవత్సరాలనుంచి 30 సం॥ల నుంచి సాగుచేసుకుంటున్నారు. అయినా ప్రభుత్వం పెనాల్టీలువేసి అకారణంగా వాళ్ళను భూములనుంచి తొలగిస్తున్నారు. అదిచాలా అక్రమం. కాబట్టి సదరు భూముల్ని వాళ్ళకి యిప్పించవలసినది అంటున్నారు. కొన్నికొన్ని భూములను ప్రభుత్వం కొన్నికొన్ని కారణాలచేత గ్రామకంఠము, చెరువు గర్భము, నీటిముణక, యేటిపోరంబోకు ఎవరికి కూడా మహారాజుకుగాని పేదరైతుకుగాని పట్టామీద యివ్వకూడదని కొన్ని నిబంధనలు పెట్టింది. వాటిని యివ్వడము కొంతవరకు మంచిదని కొందరంటారు. 20 సంవత్సరాలనుంచి సాగుచేస్తున్న కారణంచేతను, వాళ్ళు పేదవాళ్ళవడంచేతను వాళ్ళకు యివ్వమంటున్నారు. కాని ఆభూములు పేదవాళ్ళు సాగుచేసినా మహారాజు సాగుచేసినా యివ్వకూడదని రెవెన్యూ బోర్డు standing order లో నిబంధన వున్నది, సాగుచేయకూడదని భూమిని సాగు చేస్తే penalties వేస్తారనికూడా ఉన్నది.

పేదరైతులైతే చాలాకష్టం చెల్లించడానికి. నిశ్చయంగా పేద వాళ్లుసాగుచేస్తుంటే వదిలేస్తున్నారు. ఇతరుల పేరుతో భూమివుండి మహారాజు సాగుచేస్తుండే వ్యవహారాలు కొన్నివున్నాయి గ్రామాల్లో. జమీందారీప్రాంతాల్లో కొన్ని అవకతవకలు జరిగాయి. గ్రామాలలో పోరంబోకులు, గ్రామకంఠాలు మొదలైనవి ఏమీలేకుండా అన్నింటికి పట్టాలు ఇచ్చారు. ఒకచిన్నబావి త్రవ్వించడానికి కూడా ప్రభుత్వానికి ఆగ్రామాల్లోఇప్పుడు స్థలంలేదు. సంఘఅవసరాలకోసము పెట్టిన ప్రాంతాలన్నీ స్వాధీనంలోవుండి, పెనాల్టీలు రద్దుచేయమనడం సబబుకాదు. రేపు గ్రామాభ్యుదయాన్ని ఏవిధంగానూ సాధించలేకపోతారు. Abandoned tank అంటే చెరువు తెగిపోయిందిఅన్నమాట. ప్రభుత్వం మరమ్మత్తు చేయించలేకపోవచ్చు. ఆభూములల్లో 20 సంవత్సరాలనుంచి సాగుచేస్తున్నా నేడు ఇవ్వకూడదు. 30 సంవత్సరాలనుంచి చెరువుగర్భంలో జమీందారీ దగ్గర పట్టాపొంది చెరువులో వున్నభూభాగాన్ని ఎవరైనా సాగుచేస్తుంటేదాన్ని evict చేయించడానికి ప్రభుత్వానికి అధికారంవున్నది. ధనవంతులు కొంతమంది కలిసికొన్ని జమీందారీ ప్రాంతాల్లో చెరువులదున్ని సాగుచేస్తున్నారు. వాళ్లను evict చేయకపోతే లాభంలేదు. చెరువు ఇప్పటికే ఉపయోగంలోనికి రాకుండాపోతుంది. చెరువు క్రింద పంటేపండదు. అది major irrigation tank అయివుంటుంది. గవర్నమెంటు స్వాధీనంచేసుకుని repair చేయడానికి వీలైన భూభాగాన్ని ఎవరైనా స్వాధీనం చేసుకుని సాగుచేస్తుంటే వాళ్లను evict చేయవలసి వుంటుంది. ఆప్రాంతం అభివృద్ధికానేకాదు అట్లా చేయకపోతే. ఇటువంటి చిక్కులన్నింటినీ ఆలోచించకుండా ఇవ్వాలి అని చెప్పడం ఒప్పుకోడానికి వీలులేనిసమస్య. మనవారు 39 లక్షల ఎకరాలభూమి బంజరుగావున్నట్లు లెక్కలు చూపించారు. ఆ లెక్కలు సరిగాలేవు. అంత భూమిలేదు. ప్రభుత్వం వారిలెక్కలనుంచి నేను చూపిస్తాను. ఆంధ్రరాష్ట్రంలో నిరుపేదలుగా వున్న వ్యవసాయ కూలీలచేతులోవున్న భూమి 6,07,508 ఎకరాలు 77 సెంట్లు మాత్రం. అంటే నిరుపేదలుగా వ్యవసాయ కూలీల చేతుల్లో 6 లక్షల చిల్లరఎకరాలు మాత్రమేవున్నవి. అందులో objectionable lands వున్నాయి, unobjectionable lands వున్నాయి. Objectionable lands విషయంలో పట్టాఇవ్వడానికి వీలు లేదు. గ్రామ అభివృద్ధి ప్రణాళికలదృష్ట్యాకాని ఇరిగేషను డిపార్టుమెంటువారి ప్రణాళికల దృష్ట్యాకాని, ఇవ్వడానికివీలు లేదు. ఇవ్వడానికి వీలైనభూమి 4,06,862 ఎక

రాల 79 సెంట్లువున్నది. అంటే 4 లక్షల ఎకరాలు చిల్లరభూమిమాత్రమే ఇవ్వడానికి వీలువున్నది. భూమికలిగివున్న రైతులు, మహారాజులు స్వాధీనం చేసుకున్న భూమి 4,95,127 ఎకరాల 84 సెంట్లు మాత్రమే వున్నది. రాష్ట్రం మొత్తంమీద అందులో ఈనాడు స్వాధీనంచేసుకోడానికి వీలుగా వున్నది 2,41,171 ఎకరాల 86 సెంట్లు భూమిమాత్రమే. ఇక సాగులో లేకుండా స్వాధీనంచేసుకోకుండావున్న భూమి రాష్ట్రం మొత్తం మీద 11,95,137 ఎకరాల 37 సెంట్లు. దీంట్లో సాగుచేసుకోడానికి వీలైన భూమి 6,95,519 ఎకరాల 35 సెంట్లు భూమి మాత్రమే లభిస్తుంది. మొత్తంమీద లెక్కవేస్తే ఈనాడు పేదరైతులకు పంచడానికి కావలసిన బంజరుభూమి 13,43,853 ఎకరాల 3 సెంట్లు మాత్రమేవున్నది.

Sri T. Nagi Reddi :—Point of information ఈ లెక్కలు ఎక్కడనుంచి, season and crop report నుంచియా administration reprot లో నుంచా ?

Sri B. Krishnamurty Rao :—నేను ఏదోవిధంగా ఈ సమస్య మీద సమాధానం ఇవ్వడానికి సంపాదించుకున్నాను.

Sri T. Nagi Reddi :—ఎందుకంటే మేము ఇచ్చిన లెక్కలన్నీ season and crop report లో నుంచి. మీరు ఇచ్చే లెక్కలకు మేము ఇచ్చినవాటికి పెద్దతేడా లేకపోయినా తేడావున్నది. అందుచేత మీ sources of information చెబితే కొంత ఉపయోగపడుతుంది.

Sri B. Krishnamurty Rao:—నేను ఏమి D. O. లు వ్రాసి తెప్పించుకోలేదు. ఏదో departmental secretary లను అడిగి తెచ్చుకున్నాను. అధికారపూర్వకంగా వాళ్లు ఇవ్వలేదు అనుకోండి. సమస్య వచ్చినపుడు శాసనసభ్యులముందు దాని నిజమైన సమాచారం చెప్పవలసి తెచ్చాను. 13 లక్షలపై చిలుకు ఎకరాల భూమినిరుపేదలైన వ్యవసాయకూలీలకే ఇవ్వాలిఅనిచెబుతున్నాను. ఇందులో నిరుపేదలైన వ్యవసాయ కూలీలు ఎంతమందివస్తారంటే, 1951 census report లో agriculture క్రిందచూడ్డండి. భూమిలేకుండా వున్నవారు ఎంతమంది వున్నారో చూడ్డండి. [illegible]

" It will be seen that a little over 50 per cent. (54 per cent to be exact) of the agricultural population consists of persons who cultivate mostly their own lands and their dependants. The next largest category is that of cultivating labourers (28 per cent). Lessees and their dependants account for 15 per cent of the agricultural population, while 3 per cent are non-cultivating owners, agricultural rent receivers and their dependants."

మనం ఈబంజరుభూమి పంపకంలో 28% మందికిమాత్రమే ఇవ్వాలిసి వుంటుంది. 5 ఎకరాలు ఇవ్వాలిఅని ఒకచోటఅన్నారు. 10 ఎకరాలు అని మరొకచోట అన్నారు. Practical గా చూస్తే తప్పుకోడానికి వీలు లేని ఇబ్బందులు కొన్ని వున్నాయి. ఒకగ్రామంలో 200 ఎకరాలు బంజరువుంటుంది. 100 మంది పేదరైతులు దానిని సాగుచేస్తూవుంటారు. అందులో 50 ఎకరాలు objectionable land అయితే మిగతా 150 ఎకరాలు మాత్రమే పంపకం చేయవలసి వుంటుంది. 100 మంది రైతులుకు 150 ఎకరాలు మనిషికి 5 ఎకరాలు చొప్పున ఇచ్చినా కొంత మందికి ఇవ్వడం, కొంతమందికి లేకపోవడం జరుగుతుంది. వారికి సరిగా పంచితే $1\frac{1}{2}$ ఎకరాలు మాత్రమేవస్తాయి. మరికొన్నిచోట్ల కొంత తేడాగా రావచ్చును. స్థానిక పరిస్థితులనుబట్టి proportionate గా 5 ఎకరాలు ఇవ్వాలంటే ఇబ్బందులు వున్నాయి. కనీస భూవసతిప్రమాణం ఏమి అని ఇంతివరకు ప్రభుత్వం నిర్ణయించలేదు.

5 ఎకరాల భూమి పంచాలన్న వాదం చూద్దాం. ఒక గ్రామంలో 20 ఎకరాల భూమి వేరొక గ్రామంలో 200 ఎకరాల భూమివుండవచ్చు ఇవన్నీ పంచేస్తే అనేకమైనట్టి చిక్కులు వస్తాయి. ఈ objectionable lands అన్నికూడా ఎన్నిసంవత్సరాలనుంచి సాగుచేస్తున్నప్పటికీ evict చేయవలసినదే. ఒకచట్టం ముందర పేదవాడైనాసరే మహారాజయినా సరే తేడాలేదని మనమందరము అంగీకరించిన విషయం.

Sri K. Venkaiah :— వారి వుపన్యాసంలో objectionable lands 10 సంవత్సరాలనుంచీ సాగుచేసిన వారెవరైన evict చేస్తాలన్నారు. ఎలాంటి వారో స్పష్టంచేయాలని కోరుతున్నాను.

Sri B. Krishnamurthy Rao:—10 సంవత్సరాలనుండి గ్రామాధికారుల లెక్కలలో వ్రాయకుండా సాగుచేసిన వారువుండవచ్చు. లెక్కలలో [illegible] లేదు. లేకుండవంటిదాన్ని వున్నదనడం చాలాఅన్యాయం. అక్క

మంగా ఆక్రమించడం అనే తప్పు ఎవరుచేసినాతప్పే. కొన్నికొన్ని చోట్ల హరిజనులకు house sites యివ్వడానికి యేదైనా భూమివున్నదా అంటే ఆ భూమి యిదివరకే ఆక్రమించబడివుంటె evict చేయించడంన్యాయం. క్రిమినలు ప్రాసిక్యూషన్ చేయించి జయిలుకు పంపవలెనని నా అభిప్రాయం. రాజకీయ బాధితులకు భూమి యిస్తున్నారన్న అంశానికి వస్తాను. ఇదివరకు ప్రభుత్వం ex-military వారికి భూములు యిచ్చారు. I. N. A. వారికి భూములు యిచ్చారు. వారికిచ్చిన భూములగురించి లేని అభ్యంతరాలు రాజకీయ బాధితులకు యిచ్చిన భూముల విషయంలో ఎందుకు రావాలో తెలియడంలేదు. గత శాసనసభలో ప్రతిపక్షంనుంచి శ్రీ వీరభద్రంగారు "ఆంధ్రరాష్ట్రావతరణకు పొట్టి శ్రీరాములుగారి మరణానంతరము కాల్పులకు గురియైనవారి కుటుంబాలకు ఏమైనా పరిహారం యిస్తారా" అన్నప్రశ్న వేయడంలో దేశభక్తులకు పరిహారం యివ్వాలన్నది అసెంబ్లీలో ప్రతిబింబింపచేశారు.

ఆంధ్రరాష్ట్రానికి త్యాగం చేసినవారికి పరిహారం యివ్వడం ధర్మం అని ప్రతిపక్షంవారు భావిస్తే అదేవిధంగా దేశంకోసం త్యాగంచేసిన రాజకీయబాధితులకు ౫ఎకరాల భూమియివ్వడంలో ఏమినష్టంవున్నది? అని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. శ్రీమాన్ రాజగోపాలాచారిగారు ప్రతిపక్షంవారికి భయపడి రాజకీయబాధితులకుయిచ్చే పరిహారాన్ని భగ్నం చేశాడు. దేశంకోసం త్యాగం చేసినవారిని బీదవాళ్ళే అనీ, ధనవంతులు త్యాగంచేయకూడదనీ ఎక్కడా చెప్పలేదు. వారుచేసినత్యాగం recognise చేయడం భావ్యం. అదేవిధంగా కమ్యూనిష్టుపార్టీ రష్యాలో అధికారంలోకి వచ్చినతరువాత విప్లవంలో పాల్గొన్న వారందరికీ తగిన గౌరవస్థానంయిచ్చారు. కనుక రాజకీయబాధితులకు భూములివ్వడం న్యాయం. ఈ అవకాశాన్ని నాకిచ్చినందుకు అధ్యక్షులవారికి నావందనాలు తెలుపుతూ విరమిస్తున్నాను.

Sri B. Lakshminarasa Raju:—అధ్యక్షా, యీబంజరుభూముల సమస్య శాసనసభలోనే కాకుండా పల్లెటూళ్లలో ప్రజలకు మంత్రులకు కూడా చాలా చిక్కుసమస్యగావున్నది. ప్రతిరోజూ వచ్చిన ప్రశ్నల్లో సగానికి పైగా వీటినిగురించే వున్నవి. ఏగ్రామంలోనైనా ఏచిన్నసమస్య వచ్చినాకూడా దీనితో సంబంధించి వుంటుంది. దీని పరిష్కారానికి ప్రభుత్వంవారు కూడా చాలా ప్రయత్నాలు చేస్తూవున్నారని వింటాం

[Sri B. Laksminarasa Raju] [25th February 1954

కాని ఎలా పరిష్కరించాలో సంపూర్ణంగా ఒక నిర్ణయానికి వచ్చినట్లు కనపడదు. నాముందు మాట్లాడినవారు చెప్పినదేమిటంటే రకరకాలైనటువంటి బంజరుభూములున్నాయి, కొన్ని పట్టాలు ఇవ్వడానికి వీలున్నాయి, కొన్ని వీలు లేదని వారుచెప్పారు. వాస్తవమే సాముదాయకంగా ఒక గ్రామంలోవున్న భూమినిపంచి ప్రజానీకాన్ని బాధపెట్టండని ఎవ్వరూ చెప్పరు. ఏవిధమైన అభ్యంతరం లేకుండా 20 సంవత్సరముల నుంచి సాగుఅయ్యే వేలకొద్దీ ఎకరాల భూములగురించియే ప్రధానసమస్య. దీన్నిగురించి అనేకసార్లు మంత్రులు పర్యటించినప్పుడు వారి దృష్టికి memorandum ల ద్వారా ఆయాప్రాంతాల బంజరుభూముల సంఘ రైతులు యిబ్బందులు చెప్పుకున్నారు. నరసాపురంలో పర్యటించిన రెవిన్యూమంత్రిగారికి తెలుపుకున్నాం. వారు మాయిబ్బందులను చాల శ్రద్ధతో విన్నారు. అయినా ఇప్పటికి ఏమీ ఆర్డరుమాత్రం పడలేదు. ఉదాహరణకు నరసాపురం తాలూకాలో బీదరైతులవద్ద నుంచి 20 రెట్లు 30 రెట్లు పెనాల్టీలు వేసివసూలుచేస్తున్నారు. Revenue మంత్రిగార్కి యీసంగతి తెలియచేశాము. ఆలోచిస్తాం అన్నారు. ఇంతవరకు ఏమీజరుగలేదు. పశ్చిమగోదావరి జిల్లాలో కొల్లేరు ప్రాంతం వున్నది. ఆభూముల్ని కొందరు భూస్వాములు సొంతంచేసుకుని చిన్నరైతులను చాల యిబ్బందులుపెడుతున్నారు. ఇండ్లగడ్డికొఱకు, గొడ్లను మేపుకొనుటకు పుల్లరి వసూలు చేస్తున్నారు. దీనివిషయం అనేకసార్లు ప్రభుత్వదృష్టికితీసుకువచ్చాం. ఇంతకుముందు శ్రీ క్రిష్ణమూర్తిరావుగారు మాట్లాడుచు రాజకీయబాధితులకు భూములివ్వడంలో వ్యతిరేకం వుండకూడదని అన్నారు.

నిజమైన రాజకీయబాధితులకు కావలసిన పొలము యివ్వాలి. రాజకీయ వాదులలో ఒకరైన పోడూరు పేర్రాజు నిజమైన రాజకీయ బాధితుడు. ఆయన రాజకీయ జీవితము శ్రీ ప్రకాశంగారి రాజకీయ జీవితమంత ఉంటుంది. అటువంటివారికి యినాములు ఇవ్వవద్దనలేదే. యీవేళ తినడానికి తిండిలేకుండవున్నారు. కాంగ్రెస్‌లోని కొందరు విసిగి చిట్టచివరకు కాంగ్రెస్‌ను వదలి యితరపార్టీలలో కూడ చేరిపోయారు. ఏలాంటివారికి భూములిచ్చారు? యింతకుముందు యిచ్చిన ఉపన్యాసకులలో బీదప్రజలకు బంజరుభూము లివ్వాలని పెనాల్టీలురద్దు చేయాలని చెప్పారు. కాంగ్రెస్‌వారు రామరాజ్యము స్థాపించాలనిగాంధిగారి అడుగుజాడలలో నడువాలని గొప్పగాచెప్పారు.

25th February 1954] [Sri B. Lakshminarasa Raju]

రామరాజ్యము రాలేదు. గాంధిగారి అడుగుజాడలలోను నడవనూ లేదు. ముఖ్యముగా ప్రభుత్వము మొట్టమొదట బంజరుభూమి సమస్యను పరిష్కరించాలి. సాధ్యమైనంత త్వరలో బంజరుభూములను బీదలకు యిచ్చుటకు తగిన కృషిచేస్తారని ఆసిస్తున్నాను. కొన్ని కొన్ని ప్రాంతాలలో కిరణాలుచేసే అక్రమాలు భరించరానివి. యీ అక్రమాలను ప్రభుత్వం వెంటనేఆరికట్టాలి. బీదరైతులు చాలయిబ్బందులు పడుతున్నారు. యీ బీదరైతులకు వెంటనే పట్టాలుయివ్వాలనికోరుతూ విరమిస్తున్నాను

Sri K. Santhappa:—అధ్యక్షా, యీ బంజరుభూముల విషయములో మేముపడే అవస్థలు అనేక గౌరవనీయసభ్యులు వెల్లడించివున్నారు. ప్రభుత్వము దీనివిషయమై శ్రద్ధతీసుకోవాలి. ఇప్పుడు Government బీద ప్రజలపై పెనాల్టీలు విధిస్తూవున్నారు. కరణాలు పెట్టేబాధలు యింత అంతకాదు అనంతపురములోవుంటే భూమి కర్నూలులో కర్నూలులో వుంటే భూమి అనంతపురములో చూపుతారు. ప్రభుత్వావాండ్లకు ఎన్ని విధాల చెప్పుకున్నకూడా మామొర ఆలకించేవారులేరు. ప్రతిగ్రామములోను యీ బాధచెప్పడానికి సాధ్యముకాదు. ప్రభుత్వమువారు మాకు భూములనిచ్చి మమ్ములను వృద్ధికి తీసుకరావాలని ఆశిస్తున్నాము. 'మా భూములు ఉత్తరసర్కారు భూములవంటివి కావు. మావి ఎర్రనేలభూములు గుట్టలు కొండలు. మూడు నాలుగు ఎకరాలు యిస్తామంటారు. కనీసము 10 ఎకరాలైనా యిస్తే జీవనానికి సరిపోతుంది. అనంతపురం జిల్లాలో 2,45,325 ఎకరములు వున్నవి. రివెన్యూమంత్రిగారు రైతుకాబట్టి చక్కగా గమనించి ముఖ్యముగా మాబీదల విషయములో శ్రద్ధ తీసుకోవాలని నా మనవి. ఇప్పుడు ప్రభుత్వమువారు యిచ్చే భూములు ఏ ఆటంకాలు లేకుండా రాజకీయబాధితులకు, మాజీసైనికులతోబాటు మాకుకూడ యివ్వాలని కోరుతున్నాను. మాజిల్లాలో ఒక్కొక్క రైతుకు 2 వందల 3 వందల ఎకరాలు స్వాధీనములో వున్నవి. మేముగనుక ఆభూమిని చేయడానికి పోతేమాకు కొరడాదెబ్బలు, జైళ్ళలో పెట్టడము జరుగుతుంది. ప్రభుత్వము సరియైన శ్రద్ధ తీసికొని యీ బాధ తొలగించాలి. ఇతర పార్టీ సభ్యులు ప్రభుత్వ సభ్యులు అందరు మా కష్టాలను గురించి చెప్పినారు. మమ్ములను యీ కష్టాలనుండి తొలగించాలని ప్రార్థిస్తున్నాను.

(At this stage Mr. Speaker resumed the Chair)

(Mr. Speaker called upon Sri Pragada Kotaiah to speak.)

[25th February 1954

Sri Pillalamarri Venkateswarlu :—అధ్యక్షా, ఇప్పటికే time ఐంది. మనకు non-official day ఎప్పుడో ఒకసారి వస్తుంది. యిక చేయబోయేది మామూలు ఉపన్యాసాలే. Closure motion move చేస్తాము. Closure motion admit చేయాలి.

Sri Pragada Kotaiah :—ఇంక మాట్లాడేది ఎక్కువ వుండిన, చేయవలసిన సూచనలు ఏమిలేవని వెంకటేశ్వర్లుగారు చాల సాహసించి మాత్రము చెప్పారు.

Sri Pillalamarri Venkateswarlu :—నేనేమి సాహసించి చెప్ప డములేదు. కార్యక్రమము సాగుతూనే వుండాలి. ప్రగడ కోటయ్యగారు చెప్పేది చెప్పుతూనే వుండాలి. మేము వింటూనే వుండాలి.

Sri K. Rajagapal Rao :—అధ్యక్షా ! అనధికార తీర్మానాలపై ఏరోజు కార్యక్రమము ఆరోజు dispose off చేయాలి. లేకపోతే అనధి కార దినాల్ని సభ్యులు పూర్తిగా వినియోగించుకోటానికి వీలుండదు. అందుచేత యీ రోజే పూర్తిచేయడానికి మీరు ఒప్పుకుంటే చర్చకు అవకాశమివ్వండి. మాకేమి అభ్యంతరములేదు. మొత్తంమీద యీ తీర్మానం యివ్వాళ dispose చెయ్యాలనేదే మాఉద్దేశం. అనధికార దినాల్లో సభ్యులకు మరింత అవకాశం కల్గించడానికి గాను యీ చర్చను యివ్వాళ తమరు పూర్తిచేయాలని కోరుతున్నాను.

Sri L. Lakshmana Das :— అధ్యక్షా, ఈ బంజరు భూముల విషయములో, ప్రభుత్వం ఒక శాసనము చేయనున్న సంగతి సభ్యులకు తెలుసును. అందుచేత యీ సమస్యపై సభ్యులు, చాలామంది తమ వుద్దేశ్యములను, తమ పథకాలను చెప్పుకొనుటకై అవకాశం కలిగించేం దుకు హెచ్చుకాలము యివ్వాలి. ప్రభుత్వం రేపుతెచ్చే బంజరు భూముల బిల్లులో యివి చాలా వుపయోగముగా వుంటాయని మనవి చేస్తున్నాను.

Sri Pillalamarri Venkateswarlu :—ప్రభుత్వమునకు అటువంటి వుద్దేశ్యం వుంటే, ప్రభుత్వమే ఒక తీర్మానం తీసుకొని రావచ్చును.

మనకు ఎప్పుడో ఒకసారి non-official day వస్తుంది. ఆరోజంతా యిదేవిషయంమును గురించి, మాట్లాడుతూవుంటే మిగతావాటికి, అవ కాశం లేకుండావుంటుంది. కావాలంటే మరొక రోజున దీనిని ఏర్పాటు చేసుకొనవచ్చును. నాకేమీ అభ్యంతరములేదు. అందువల్ల యీ విష యమును ఇప్పటికి close చేయమని కోరుచున్నాను.

Sri G. Latchanna :—ఈ విషయం చర్చించి ఒక తీర్మానంచేయటం అవసరమా, లేదా అని ఆలోచించి అవసరమైతే కొంతకాలము పెట్టుకొనడం మంచిది. సభ్యులలో మాట్లాడేవారు వున్నప్పుడు time ఇవ్వడం అవసరం. మేము యీ సిద్ధాంతం అంగీకరించివుంటే ఈ చర్చకు యింత సమస్య వచ్చేదికాదు. ప్రభుత్వం బిల్లు తేదలచుకుంటే ప్రభుత్వమే, ఒక ప్రకటన చేసినట్లయితే ఈచర్చగురించి యింతరాద్ధాంతం జరిగేదికాదు. దీనిమీద నామనవి ఏమంటే ఈ ఒక్క-సూత్రానికే సంబంధించిన అనధికారతీర్మానం ఇది అదృష్టవశాత్తు ఒకవిధంగా చర్చకువచ్చింది. ఇది రికార్డుకావటం మంచిదే కాబట్టి ఈసమస్యమీద ఒకస్థిరమైన నిర్ణయం శాసనసభ్యులు జరపటం అవసరమని నేను కోరుతున్నాను.

Mr. Speaker :—నేనుగూడా వీలైనంతవరకు యివ్వాళ 5 గంటలకే ముగించాలని చూస్తున్నాను. ప్రతిపక్షమువారు దీనిమీద మాట్లాడేవారికి వత్తిడి తెస్తున్నారు. ఇంకా 11 మంది మాట్లాడేవారు వున్నారు. ఇట్లు రెండువిధాలైన అభిప్రాయములున్నప్పుడు నేను ముగించటానికి వీలు లేదు.

Sri Pillalamarri Venkateswarlu :—దీనిమీద ఇవ్వాళే ఓటింగ్ పెట్టి పూర్తిచేస్తామంటే మాకు అభ్యంతరం ఏమీలేదు. ఎంత time అయినాసరే ఆగి, యీవిషయం ఈరోజు పూర్తిచేయటం మాకు సమ్మతమే. అట్లా వీలులేకపోతే 4 వ తేదీకి వాయిదా వేయటం మంచిదని చెప్పుచున్నాను.

The Hon Sri N. Sanjeeva Reddi:— బంజరు భూములను, యివ్వాలనే విషయమునుగురించి, ప్రభుత్వంఆలోచిస్తూనేయున్నది. కొంతమంది దీనిమీద మాట్లాడదలచుకొన్నారు. శ్రీ ప్రగడ కోటయ్యగారు చెప్పేదిగూడావింటే, note చేసుకోవడాని వీలువుంటుంది. వారు చాలా అనుభవజ్ఞులు. అటువంటివారుమాట్లాడటంఅవుసరం. అంతేగాని, యిప్పుడే ఓటింగ్ పెట్టమని నిర్బంధము చేయటం భావ్యంగాలేదు.

Sri T. Nagi Reddi :— అభిప్రాయాలు తెలుసుకోవటం మంచిదని ప్రభుత్వం అంటున్నది. ఈతీర్మానం ప్రభుత్వం అంగీకరిస్తున్నదని చెప్పితే సరిపోతుంది. వారితరఫున యింతవరకు మాట్లాడినవారు ముగ్గురేనని, గా. శ్రీ సంజీవరెడ్డిగారు తెలుసుకుంటే బాగుంటుందని మనవిచేస్తున్నాను. బడ్జటు వుపన్యాసాల్లో దీనినిగురించి చర్చలుకూడా

[The Hon. Sri N. Sanjeeva Reddi] [25th February 1954

సాగించాము. దీనినిగురించి మళ్ళీచర్చలు సాగించేదానికంటే, యీ తీర్మానం ప్రభుత్వంఅంగీకరించాలనికోరుతున్నాను. ఈ recommendation ప్రభుత్వం అంగీకరించామని చెప్పటంలో నష్టం ఏమీలేదు. అందుచేత, దానిని ఈరోజున ముగించటం మంచిది.

The Hon. Sri T. Prakasam :-ఇంతతొందరపడవలసిన అవసరం ఎట్లావచ్చిందో నాకు తెలియటంలేదు. Close అన్నమాట move చేస్తు న్నామని చెప్పినందుకు నాకు సంతోషముగావుంది. సభ్యుల అభిప్రాయం తెలుసుకునేటప్పుడు close అని చెప్పటం మంచిదిగాదు. ఇంతవరకు వారి వారి అనుభవాలను గురించి చెప్పారు. మిగతావారు చెప్పబోతున్నారు. మధ్యలో ఈ సంగతి ఎందుకు వచ్చిందో తెలియటంలేదు. ఇంకా మాట్లాడేవారు వుంటూవుంటే—"కాదు" "ఆగు" "ఇప్పుడే ఓటింగు పెట్టు" అని అంటే బాగుండదు. నేను చెప్పేది ఏమీలేదు. ఈ విష యంలో ఇతరులు చెప్పేదివుంటే చెప్పటం న్యాయం. మిగతావారు చెప్పకూడదంటే బాగుండదు. మీ యిష్ట ప్రకారం చేయండి.

Sri Pillalamarri Venkateswarlu:—అధ్యక్షా, దీనిమీద ఈ సభయొక్క అభిప్రాయం తెలుకోవాలంటే, అందరు అంగీకరించినట్లైతే, ఈ చర్చ పోనీ రేపుకూడ సాగించడానికి అనుమతి ఇస్తారా? మళ్ళీ non-official day అంటే, ఇదంతా అప్పుడు జ్ఞాపకములేకుండాపోతుంది. కనుక ఆవిధముగాకాకుండా రేపుకూడ కూర్చొని పూర్తిచేస్తాము. మాకు ఏమీ అభ్యంతరంలేదు. ముఖ్యమంత్రిగారుచెప్పారు.140మందిమాట్లాడినా వినదలచినానుఅనివారుచెప్పారు. దానినిఅచరణలోపెడుదాము అందుకని రేపుకూడ కూర్చొని దీనిని పూర్తిచేద్దాము. అంతేగాని, మీవారు ముగ్గురే మాట్లాడారు అని మామీద నిందలువేయకండి. ఆనింద మా మీదవేయడానికిపూనుకోకండి. మిగతా అన్నిపార్టీలలోను అనుభవజ్ఞులు మాట్లాడ దగినుకొన్నవారుండవచ్చు. శ్రీ ప్రగడ కోటయ్యగారి మాదిరి ఇంకా అనేకమంది అనుభవజ్ఞులు ఉన్నారు. కనుక మాట్లాడేవారంతా మాట్లాడినతరువాత దీన్ని పూర్తిచేద్దాము. నిందలువేయడంమాత్రం సరియైనటువంటి పద్ధతికాదు. రేపుగూడ కూర్చొనిగాని, లేక ఈరోజే 7, 8, 9 గంటలైనాసరే పూర్తిచేసేదాకా కూర్చొంటె బాగుం టుంది. అంతేగాని మళ్ళీ తిరిగి non-official day అంటే అది సబబు కాదని నేను మనవిచేస్తున్నాను

25th February 1954]

Sri Pragada Kotaiah:—అధ్యక్షా, ఈవిషయమై చాలా దీర్ఘంగా చర్చలుజరిగాయి. గతసమావేశములో కూడ బడ్జెటు సందర్భములో దీని మీాద చాల తర్జనభర్జనలు జరిగాయి. చివరకు ప్రభుత్వము మంత్రివర్గము నుంచి ఒక ఉపసంఘమును ఏర్పాటుచేసింది. ఈ ఉపసంఘములో మన రివిన్యూమంత్రిగారు, ఆర్థికమంత్రిగారు, సహాయశాఖమంత్రిగారుఉన్నారు. వీరు అక్కడక్కడ చేస్తున్న ఉపన్యాసాలు బట్టిచూస్తే, ఈ శాసనసభా సమావేశములో ఒకబిల్లు తీసుకురావడానికి అన్నిఏర్పాట్లు చేస్తున్నాము అన్నట్టుగా చాలమట్టుకు గోచరించింది. కాని ఈనాటి కార్యక్రమాన్ని బట్టి చూచినప్పుడు వారు అలాంటిబిల్లును వెంటనే తీసుకురావడంలేదు. అని అభిప్రాయపడవలసిన అవసరమున్నది. మొత్తంమీాద ఈ సమస్య ఎంతప్రధాన మైనదో అన్నిచిక్కులుతోటి కూడుకొనియున్నది. ఈసమస్యను పరిష్కరించడంలో ప్రభుత్వము ఎంత ఆలస్యముచేస్తే అంత అదనంగా చిక్కులు వచ్చేందుకు అవకాశాలున్నాయి. ఈ చిక్కులుకూడా ఉన్నవారిమధ్య, లేనివాని మధ్యనేకాకుండా, లేనివారిమధ్య లేనివారి మధ్యకూడా చాలా విపరీతంగా పెరగ గలవు. ఈలాంటి పరిస్థితులలో ఈ సమస్యను శాశ్వతంగా పరిష్కరించడంకోసం ప్రభుత్వము ఎదైనా ప్రత్యేక మైనటువంటి శ్రద్ధ తీసుకోవలసిన అగత్యము కనిపిస్తున్నది. ముఖ్యంగా ఇప్పుడు డెల్టాగ్రామాలకు వెళ్లిచూస్తే, ప్రజలసమష్టి ఉపగయోగం కోసం ఉండవలసిన community భూములన్నీ ఎవరో అక్రమించుకొన్నారు. గ్రామములలో ఈనాడు పశువులు ఉండటానికి ఏదైనా ఒక సమిష్టభూమి సౌకర్యము కొంచెమైనా లేకుండాయున్నది. యే చెట్టునీడలోనో అవి వుండవలసి వస్తున్నది. చెట్టునీడకూడ లేకపోయినట్లైన, పశువులు ఎండలో నిలబడవలసివస్తున్నది. అందువల్ల బంజరులసమస్య వచ్చినప్పుడు, విధిగా ప్రతిగ్రామమునకుమొత్తముమీాద సమిష్టిభూమి కోసము కొన్ని భూములు ఉంచాలా లేదా అనే విషయాన్నిప్రభుత్వము ముఖ్యంగా అలోచించవలసియున్నది. ఇక ఈభూములను పంపంకం చేయడంలో, ఇవి బీదవారికిపంచాలి అనే విషయములో ఎవరికిని వివాద ముండనవసరం లేదు. అయితే సహకార సంఘముల ద్వారా ఈ భూములను పంచాలి అనే ఆలోచన ఒకటివున్నది. కాని సహకారసంఘములు ఏర్పాటుచేసి సమిష్టిగా వీటికి 4 వందలు, 5 వందలు ఎకరాల భూమిని కౌలుకు ఇచ్చిన, ఇతరవిధాల కొన్ని చిక్కులు వచ్చుటకుకూడ అవకాశమున్నది. సహ

[Sri Pragada Kotaiah] [25th February 1954

కారసంఘములలో ఈ ప్రజాస్వామిక సూత్రాలన్ని అమలులో ఉండవు. కాబట్టి మెజార్టీ పక్షాలు మైనార్టీ పక్షాలనుబయటకు నెట్టడానికి అవకాశాలు ఉన్నాయి. అందువల్ల భూముల సేద్యము కోసము మాత్రము సహకార సంఘములను ఏర్పాటు చేయడం సరియైనటువంటి విధానము కాదు. ముఖ్యంగా ఎవరికి అర్హతఉన్నదో, వారికి ఆభూములమీద సర్వవిధాల హక్కును ఏర్పాటుచేసి వారు సేద్యముచేసుకొనడానికి సహాయంగా మాత్రము ఈ సహకారసంఘాలు ఏర్పాటుచేయాలి. దానిలో ఇష్టము ఉన్నవారు ఎవరైనాచేరితే, అటువంటిపేదవారికి ఎరువులు, విత్తనాలు సరఫరా విషయములోగాని, నీటి సరఫరా విషయములోగాని, తదితర వసతులు ఇవ్వడంలో సహాయం చేయడంకోసం సహకారసంఘాలు తోడ్పడాలి. ఇవిలేకుండా, బీదలకు తలకు 4, 5 ఎకరాలు ఇచ్చాము, వారు సేద్యము చేసుకోగలరు అని ప్రభుత్వము అనుకుంటూయుంటే ఈ భూములు క్రమంగా ధనవంతుల పరమో, లేక ఏ భూస్వాములపరమో అవడానికి అవకాశమున్నది. అయితే ఇలాంటి సంఘములు నిర్మించడానికి ప్రభుత్వమునకు కొంత వ్యయం అవసరము. ప్రత్యేకమైనటువంటి సహాయం చేయవలసిన అగత్యం ఉంటుంది. అయితే ఇలాంటి సహకార విధానం ఇప్పుడు అమలులోలేదా అంటే ఉన్నదిగాని ఉన్న సంఘాలను కట్టుదిట్టాలు చేయడానికి ఎలాంటి ప్రయత్నం జరుగలేదు. ఇవి Co-operative Central Bank కు affiliate అయిఉండాలి. వీటికి ఆర్థిక సహాయము లేక వాటంతటవే వదలిపెట్టబడినవి. వీటిమీద supervision కూడలేదు. ఉదహారణకు, గుంటూరుజిల్లాలో 2 వందల సహకార సంఘాలున్నాయి. అయితే ఈ 2వందల సహకారసంఘములలో, బేదాభిప్రాయాలు రాకుండా సమిష్టిగా సేద్యం చేసుకోడానికి అనువైన పరిస్థితులు కల్పించడానికి తగిన సహాయము ఇవ్వడానికి ప్రత్యేకముగా ప్రతి పది సంఘములకు ఒక Senior Inspector ను ఇవ్వవలసిందని అడిగితే, దాదాపు రెండుసంవత్సరములకు ఆకాగితము ఆజిల్లాకలెక్టరుకుపోయి అక్కడనుంచి Deputy Registrar కు, మరల అక్కడనుంచి Registrar కు వెళ్ళింది. ఆతరువాత Development Department కువచ్చింది. తరువాతఏమైందో తెలియదు. అప్పుడుమనరాష్ట్రవిభజనసందర్భంలో అక్కడేనిలిచిపోయిందో లేక కర్నూలుకు ఆ రికార్డు వచ్చిందో తెలియదు. ఈ విషయాన్నిగురించి సహకారమంత్రి శ్రీ సంజీవయ్యగారికి 4, 5 సార్లు చెప్పడంకూడ జరిగింది. ఇంతవరకు ఈ విషయములో ఏ నిర్ణయానికి రావడం జరగలేదు.

ముఖ్యంగా బంజర్లు అన్నప్పుడు ప్రత్యేకమైనటువంటి నీటి వసతులుకూడ కలిగించేవిషయముకూడ ప్రభుత్వము ఆలోచించాలి. మెట్ట ప్రాంతాలలో ఒక పది ఎకరాలు ఇస్తున్నారంటే వాటివల్లఉ పయోగము ఉంటే కొంతమట్టుకు ఉండవచ్చు. కాని నీటివసతులను కల్పించడానికి ప్రభుత్వము ఎంతవరకు పూనుకొన్నదీ ఆలోచించవలసిన అగత్యం ఉన్నది. ఈ బంజర్ల విషయములో శ్రీకిష్ణమూర్తిగారుఇక్కడకొన్నిఅంకెలుసేకరించినట్లు స్పష్టమౌతుంది. కాని అవిఎంతమట్టుకు సరియైనవో చెప్పటానికి వీలులేదు. కనుక ఈవిషయములో నిజము తెలుసుకోవాలంటే, బంజర్లకు సంబంధించినటువంటి అంకెలను ప్రభుత్వము కలెక్టర్లనుండి సేకరించాలి. ఇక్కడ వీరు సేకరించినటువంటి లెక్కలు, నిజమైన లెక్కలని అనుకోవడానికి వీలు లేదు. గ్రామాలలో కరణాలకు సంబంధించినటువంటి వ్యవహారములలో, మునసబులకు సంబంధించినటువంటి వ్యవహారములలో భూస్వాములకు సంబంధించినటువంటి వ్యవహారములలో పెద్దపెద్ద అభిప్రాయభేదాలుండడంవల్ల, కరణాల లెక్కలు సిసలైన, న్యాయమైన లెక్కలని అనుకోడానికి అవకాశంలేదు. అందువల్ల తగాదాలు ఏవిధంగా పరిష్కారం చేయడం అని ఆలోచించినప్పుడు, సాధారణంగా ప్రతిజిల్లాకు ఉండే కలెక్టరు, ఆయనక్రింద ఉండే తాసిల్దారు, డిప్యూటీ తాశిల్దారు, R.Is వీరు చేస్తారని అనుకోడానికి అవకాశంలేదు. ఏరికి సాధారణంగా ఉండే కార్యక్రమాలకే యావత్తు కాలము వినియోగింప బడుతూ యుంటుంది. దీనికి ప్రత్యేకంగా శ్రద్ధ వహింపలేరు. కనుక ఈ బంజరు సమస్యను వెంటనే పరిష్కరింపదలచుకొంటే, ప్రతిజిల్లాకు దీనికొరకు ప్రత్యేకముగా ఒక డిప్యూటీ కలెక్టరును appoint చేయడం అవసరం. ఈ డిప్యూటీ కలెక్టర్లక్రింద తగినంతమంది R.Is ను కూడ appoint చేయవలసి యుంటుంది, ఎందుకంటే ఈ పోరంబోకులుగా ఉండేవాటిని assessed waste గా convert చేయవలసి యుంటుంది. Unassessed గా ఉన్నదానిని survey చేయవలసియుంటుంది. కనుక ఒక్కొక్క డిప్యూటీ కలెక్టరుకు 7, 8 మంది R.Is ను ఇవ్వడమేకాకుండా, surveyors ను కూడ ఇవ్వాలి. తరువాత ఈ బంజరు పంపకం విషయములో, ఎవరికీ కూడ 5 ఎకరాలకు మించకూడదు అన్నపుడు, లోగడ ఇదివరకు ఉండే భూమి, ఆక్రమించుకొన్నటువంటి భూమికలసి 5 ఎకరాలకుమించకూడదా అనే విషయాన్ని మనము స్పష్టంచేయాలి. అయినను ఈనాడు ఆక్రమణ ఖాతాల్లో 20 యకరాలు, 30 యకరాలు, వున్నవారు, 30 సెంట్లుగూడా లేక

బాధపడుతున్నవారున్నారు. వారు నిజంగా బూస్వాములని చెప్పుకోటానికి వీలులేదు. మధ్యతరగతివారిని, వారిని సమన్వయం చేయటానికి ప్రభుత్వం కృషిచేయవలసిన అవసరం వున్నది. ఇది ప్రభుత్వం జాగ్రతగా పరిశీలించాలి. తెల్లవాళ్ళకాలమునుంచి వారు 10 సంవత్సరాలకు, 50 సంవత్సరాలకు, అంతకు పైగాకూడా యీ భూములు స్వాధీనములో పెట్టుకొనివున్నారు. ఈ విషయములో ప్రభుత్వము ఒక పరిష్కార మార్గమునకు రావలసియున్నది. Board's Standing Orders ఎప్పటి కప్పుడు అభ్యంతరాలు కలుగజేస్తూవుంటవి. ఏదైనా ఒక వ్యవహారము వస్తే, వారు రివిన్యూబోర్డుకు అప్పీలుచేస్తారు. ఆ తరువాత రివిన్యూ బోర్డు తీర్పుపైన, గవర్నమెంటు Secretariate కు అప్పీలుకువస్తుంది. దీనిపైన హైకోర్టులో writs వరకు వెళ్లుతవి. ఈరిట్లు పూర్తి అయ్యే వరకు వాయిదాలుపైన వాయిదాలు వేయించుకొని కాలయాపన చేయుటకు అవకాశాలు వుంటవి. అందువల్ల యీపరిస్థితులన్నియు ప్రభుత్వము జాగ్రత్తగా పరిశీలించి, దావాలకు, అప్పీళ్లకు అవకాశము యివ్వకుండా ప్రభుత్వము మున్ముందుగా Law Department వారితో సంప్రదించి, ఏదో ఒక నిర్దిష్టమార్గముతో ప్రభుత్వము చర్యతీసుకోవాలని నా అభిప్రాయము.

సహకారసంఘాల విషయములో నేను మరొక చిన్న సలహాయిస్తూ నా ఉపన్యాసాన్నిముగిస్తున్నాను. ముఖ్యంగా సహకారసంఘాలు, సమిష్టి వ్యవసాయమునకు సంఘాలుపెట్టటానికి యిప్పటి పరిస్థితులను బట్టి ఆ విధానము జయప్రదముగా నడచుటకు అవకాశములేదని నా అభిప్రాయము. కో ఆపరేటివ్ సంఘంద్వారా యిండ్లుకట్టుకోవాలని చెప్పారు. భూములు ఆక్రమించుకున్నవారు, సేద్యముచేసేవారు వారికి యిళ్లు సమిష్టిగా ఉండాలన్నప్పుడు వ్యక్తిగతంగా అది లాభదాయకముకాదు. సమిష్టి సేద్యముమాత్రం ఉంటె అభివృద్ధికాలేదని చూపించాను. వారికి వున్న సహకారసంఘాల విధానం యిప్పుడుచూస్తే, అభివృద్ధికి తోడ్పడడములేదు. అందువల్లభూమిమాత్రం అందరికి హక్కు ఏర్పాటుచేస్తే, వాటికికావలసిన వసరులు ఏర్పాటుచేసి రైతులతోను, ధనవంతులతోను సలహాసంఘాలను ఏర్పాటుచేస్తే, అటువంటి విధానము జయప్రదముగా జరుగటానికి అవకాశం వుంటుందికాని,సమిష్టి వ్యవసాయానికి యివ్వటానికి వీలుండదు, బంజర్లు సొసైటీలద్వారా ప్రభుత్వం యిస్తారని అక్కడక్కడ వదరతులుగా వున్నవి. లాయర్లుగా వున్నవారు 4 ఖండలు,

5 వందలు, 8 వందలు యకరాలు లీజుకు ప్రభుత్వంనుంచి సంపాదించుకున్నారు. ఇందులో కొన్ని 90 సంవత్సరాలు, 40, 50 సంవత్సరాలకు గూడా వున్నవి. ఇవన్నిరద్దుచేయాలని ప్రజలు ఆందోళన చేస్తున్నారు. ఈ విషయం Composite Madras State లో వుండగా Law Department ద్వారా దర్యాప్తు చేయగా ఈ leases విషయము రుజువుకాలేదు. ఈ leases వున్నట్లైతే, అవిరద్దుచేస్తే, హైకోర్టువరకు వ్యవహారము వెళ్లుతుందేమోకాని మీకేమాత్రం ఆదాయము తక్కువ. అందుకుఆశ కన్పించనందున విరమించుకొన్నారు. కాబట్టిపేద రైతాంగానికి యీ భూములు పంపకముచేయుటానికి, వారికి హక్కు లభించడానికి చర్యలు తీసుకొనవలెనని ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తూ శెలవుతీసుకుంటున్నాను.

Sri G. C. Kondaiah :—అధ్యక్షా, ఇప్పటికైనా యీ బంజరు సమస్యపైన ఒక తీవ్రమైన చర్చ జరుగుతున్నది దానిలో వచ్చిన అభిప్రాయం అంతయు సమీకరించి ప్రభుత్వం దానిలో ఒక హామీ ఇస్తుందని అనడం బాగానేవుంది. ప్రస్తుతం యిప్పుడు జరుగుతున్న వ్యవహారాలు చూస్తే యీ బంజర్లు తొందరగా పంచుటకు అవకాశమున్నట్లు లేదు. ఒక తహాశ్శీల్దారు ఆర్డరుయిస్తే, వెంటనే కలెక్టరుకు అపీలు వెళ్లడం కలెక్టరు మొదటి ఆర్డరును ఖాయంచేస్తే, దాన్ని కూడా కాదని రెవిన్యూబోర్డుకు వెళ్ళినప్పుడు, యిష్టమువచ్చిన ఆర్డర్లు వారు యివ్వడం జరుగుతున్నది. ఇటువంటివి అనేకచోట్ల అనేక రకాలుగా జరుగుచున్నవి. ఎవరైన ఏపాటి కొద్దిభూమిని ఆక్రమించుకొని సాగుచేసుకొంటూవుంటే, తహాశ్శీల్దారు యిచ్చిన ఆర్డర్లమీద ఆక్రమించుకొనివుంటే, ఆ భూమి ఆక్రమించుకోగూడదు అని G. O. వస్తుంది. 50, 60 ఎకరాలువరకు బంజరుభూములు ఆక్రమించుకొన్న వారు గూడా వున్నారు. దానికి police వారి సహాయ్యముతో తహాశ్శీల్దారు లోపాయికారికా కొందమంది ధనికులైన భూస్వాములకు సహాయము చేస్తున్నారు. అటువంటివారి విషయములో కలెక్టరు అయినా దాన్ని ఎందుకు ఆక్రమించుకొన్నారని అడగరు. చర్యగూడా తీసుకోరు. కాని పేదవాళ్ళు అయితే, వెంటనే ఒక G O. ప్రభుత్వమునుండి తెప్పించుతారు, భూములు ఆక్రమించుకో కూడదు అని చెబుతారు. రాష్ట్రములో యిటువంటి పరిస్థితులు ఏర్పడ్డవి. ఈ విషయాలు మన రివిన్యూమంత్రిగారి దృష్టికిగూడా తేబడినవి.

ఇంతేకాకుండా భూమిలేని పేదహరిజనులకు మూడు సంవత్సరాలుగా యివ్వకుండా ప్రభుత్వం వీళ్ళ విషయం తలచుటయే లేదు. మా ఆత్మకూరు తాలూకాలో ఒక పెద్ద భూస్వామి ఎంతో బంజరుభూమి ఆక్రమించుకొని యున్నాడు. ఒక తహశ్శీల్దారు ఒక ఆర్డరుయిస్తే, యింకొక తహశ్శీల్దారు వచ్చినప్పుడు ఆ భూమి విషయంలోనే యింకొక ఆర్డరు యిస్తూవుంటే, జిల్లాకలెక్టరు ఎందుకు యిచ్చారని ప్రశ్నించడు. అదే గనుక పేదవ్యవసాయ కూలిఅయితే, వాడిని ఆ భూమినుంచి తొలగిస్తారు. ఎప్పటి కప్పుడు జ ఓలు మారుతూవుంటే, యిందులోని అంతరార్థము తెలియడము లేదు. మంత్రులను అడిగితే జవాబుచెప్పరు. పరిశీలిస్తున్నామని అంటారు. ఇటువంటి పరిస్థితులలో ఏ పేదరైతుకూడా యీ బంజర్లను బాగుచేసుకొనడానికి, అదంత అవసరమైన వ్యయప్రయాసలతో కూడిన పనిఅని, ఆ భూములను వదలివేస్తాడు. ఈ బంజర్ల విషయములో ప్రజలలో విపరీతంగా ఆందోళన జరుగుచున్నది. ప్రభుత్వాన్ని ఎన్నిపర్యాయములు యీ బంజర్లసమస్య పరిష్కరించండి అని అడిగితే, జవాబుయివ్వరు. అదేవిధంగా కొన్ని ప్రాంతాలలో కూలీలకు యిచ్చిన భూమికూడా ఆప్రక్కనవున్న పెద్దరైతులు ఆక్రమించుకొని పాలుయివ్వడం జరుగుతున్నది. ఇప్పుడువున్న రివిన్యూ యిన్స్పెక్టరు, తహశ్శీల్దారు సహాయ్యముతో నిర్వహించుకో గలుగుతున్నారు. ఎక్కడనైనా భూములు ఆక్రమించుకొని సాగుచేసుకుంటే, ప్రజలనుండి ఆక్షేపణలు వస్తూంటవి. ఆ ఆక్షేపణ సాకుతో బంజర్లను సాగుచేయవద్దని ప్రభుత్వం చెబుతుంది. ఈవిషయాలన్నియు దృష్టిలో పెట్టుకొని, చట్టమువచ్చినప్పుడుకూడా యీసమస్య simplify చేసి ఎక్కువ యకరాలకు G. Os. మూలంగా హక్కుయిచ్చి, యీ భూములను ఏవిధంగాను కైంకర్యము చేయకుండా 3, 4, 5 ఎకరాలకు పాటపెట్టి, ఏదో ఒక యేర్పాటుచేయవచ్చు. తహశ్శీల్దారో, రెవిన్యూయిన్స్పెక్టరో పాటపెట్టడానికి, వాళ్ల చుట్టూ తిరిగేవాళ్లకు యిచ్చినప్పుడు, వాళ్లకు ఎట్లాయిచ్చారు అని అంటాను. ఇటువంటి వాటికి G. O. లు, చట్టము అడ్డురాదన్నట్లున్నది. ఇటువంటివి ప్రకటించకుండా, ప్రజలకు యిచ్చేస్తున్నారు. ఈవిషయాలు ప్రభుత్వం పరిశీలిస్తుందని ఆశిస్తున్నాను. భూమిలేని వాళ్లకు మాత్రమే భూమిఅని స్పష్టిచెప్పడం జరుగుతున్నది. పాట పెట్టడం వల్ల పేదప్రజానీకానికి అవకాశాలు లేకుండా పోతున్నవి. ఈనాడు రాష్ట్రంలో 40 లక్షల యకరాల బంజరువగైరా భూములున్నవని

ప్రభుత్వంవారి లెక్కలవల్ల తేలుతున్నది. ఈ పద్ధతి ప్రకారం పోటీ పెట్టి నట్లైతే ఒక్క కుటుంబానికి అయిదు ఎకరాలకు తక్కువ లేకుండా యివ్వవలసి వస్తుంది. ఆవిధంగా చూస్తే యీ భూమి అంతయు ఏకొద్దిమందికో రాగలదు. కేవలం భూమి యీ పేదవాళ్ళకు యిచ్చినంత మాత్రాన, ఆ భూమి సాగులోనికి రావటానికి యీ పేద వాళ్ళకు ఆర్థిక స్తోమతలేదు. అందుకని వాళ్ళకు యితర వసతులు, అనగా ధనసహాయ్యము, ఎరువులు, loans వగైరాలు యిచ్చి సేద్యమునకు సహాయపడవలసిన బాధ్యత ప్రభుత్వము మీద వున్నదని చెబుతున్నాను. అందువల్ల వ్యవసాయము సరియైన పద్ధతిలో జయప్రద ముగా సాగించాలంటే, వీళ్ళకు అప్పులు యివ్వాలి. అట్లు చేయకపోతే, క్రమేణ యీ భూముల ప్రక్కనవున్న పెద్దభూస్వాముల చేతులలోకి చేరగలవు. పేదవాళ్ళకు selling rates తో సంబంధం లేకుండా, యిచ్చినటువంటి భూమిమీద పూర్తిహక్కు యిచ్చినట్లైతే, వారు ఉత్సాహకరంగా ఆ భూములు సాగులోనికి తీసుకొని రాగలరు. వారికి దానివల్ల వుపకారంగా యిచ్చినట్లవుతుంది. ప్రభుత్వం యీబంజర్ల పంపకము విషయములో తగునైన బిల్లును తెచ్చి వాళ్ళకు తగు ఏర్పాటు చేయాలని ప్రభుత్వానికి చెబుతున్నాను.

అదేవిధంగా Agricultural Department ద్వారా యీ బంజర్ల సాగుకుతోడ్పాటుగా agricultural loans, manure, seedlingsవగైరా సహాయము చేయాలి. వంద, రెండువందలు ఎకరాలు వున్నవారికి Bulldozers సప్లయిచేయాలి. అటువంటి వసతులు వ్యవసాయా నికి ఏర్పడినట్లయితే, దేశంలో ఎంతో పంట పండించగలరు. క్షామం పోగొట్ట వీలగును. ప్రభుత్వము యీ విషయములో తగుశ్రద్ధ వహించా లని గుర్తించాలి.

తరువాత యీ భూములు విషయములో ప్రభుత్వం తీసుకురాదల చిన బిల్లులో ఒక Clause కూడా చేర్చడం అవసరమని హెచ్చరిస్తు న్నాను. ఈ నాడు పేదప్రజానీకం తిండిలేక ఎంతో బాధలకు గురిఅగు చున్నారు. ఈ బిల్లును ఎంతత్వరలో తీసుకొనివస్తే అంత మంచిదని అంటున్నాను. తాలూకాలలో బంజరుభూముల విషయములో లెక్కలు పెట్టబడినవి. ఈ విషయము ప్రభుత్వము దృష్టిలో పెట్టుకొని ఎవరివద్ద

[Sri G. C. Kondaiah] [25th February 1954

ఎక్కడ ఎంతభూమి వున్నదో తేల్చవచ్చును. తక్షణం యీ శాసనము తీసుకొనివచ్చి, అమలులో పెట్టాలి. ఇందుకుగాను extra staff అవసర మని తోస్తే, దీనికి అయ్యేఖర్చుకు ప్రభుత్వం వెనుదీయకుండా తక్షణమే ఒక శాసనము తీసుకొచ్చి, రాష్ట్రములో వున్న పేదవాళ్ళకు జీవనభృతి కలిగించుటకు చర్య ప్రభుత్వం తీసుకొంటుందని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri P. Gunnayya:—Point of order, Sir ఈ బంజరుభూముల సమస్య విషయములో ఈ దినము non-official day అని చెప్పారు. మాట్లాడేవారిని అధ్యక్షులవారు నిర్ణయిస్తారని ఆశించినను నాపేరు యింత వరకు రాలేదు. మనకు రాష్ట్రము వచ్చినప్పటినుండి నేను ఎంతో కుతూ హలముతో మాట్లాడాలని అనుకొంటున్నాను. అధ్యక్షులవారిద్వారా యీనాటి హరిజనసమస్య, మా ప్రాంతాలకు సంబంధించిన విషయాలు చెబుదామని అనుకొంటున్నాను. కాని వారు నాకు యింతవరకు అవ కాశము యివ్వలేదు. ఇప్పుడైనను యివ్వమని అధ్యక్షులవారికి వినయ పూర్వకముగా మనవిచేస్తున్నాను. విశాఖపట్టణానికి చెందిన M.L.A.లు యిదివరకే మాట్లాడారు. పార్లమెంటులోను, గ్రామాలలోను ఎంతో వర్గపాతంగా వుంటున్నప్పుడు, సభ్యులలో కొంతమందికి వున్న చిన్న అవసరాలు ఉపన్యాసాలద్వారా నైనా తీర్చుకోలేకపోతున్నారు. ప్రజాప్రతినిధులుగావచ్చి రైతాంగమునకు వున్నబాధలు యీ శాసన సభలో విన్నవించు కోటానికి వీలు కలుగ జేస్తారని ఆశిస్తున్నాను. అధ్యక్షులవారి ద్వారా మాకు ఓట్లుయిచ్చిన పెద్దమనుష్యులు, రైతు కూలీలు, ఈరైతాంగానికి సంబంధించిన 'పేదకడి' అధ్యక్షులవారియెదుట పెట్టి, దానిలోవున్న మహత్తు ఏమిటో వారిద్వారా తెలియజేయదలచు కున్నాను. ఆలాంటప్పుడు యీ శాసనసభలో అందరికి యిచ్చిన అవ కాశము నాకు గూడ వస్తుందని ఆశిస్తున్నాను. ఏదో లీడర్సుగావున్న శాసనసభ్యులకే అవకాశము యిచ్చారు గనుక నాకుగూడ కొంత అవ కాశము యివ్వమని అధ్యక్షులవారిని కోరుతున్నాను.

Mr. Speaker:—మీ పేరు నోటు చేసుకున్నానండి.

Sri L. Lakshmana Das:—అధ్యక్షా, ఈ బంజరు భూముల సమస్యవిషయములో యీనాడు అనేకమైన సూచనలు సభ్యులు అందరు తెలియజేస్తున్నారు. అసలు నిజానికి యీ బంజరుభూముల సమస్యలు

చాలాతీవ్రంగా ఆలోచించవలసిన సమస్యలుగా కన్పిస్తున్నవి. ఈనాడు ఆంధ్రదేశములో ఏమాత్రం సాగులోనికి ఏవిధంగాను రావటానికి అవకాశములేని భూములు ఎప్పుడో సాగులోనికి తీసుకునివచ్చారు. ఇంకను సాగులోనికి రాని బంజరుభూములు అనేకములున్నవి. యిందుకుగాను ప్రత్యేకమైన శ్రద్ధతీసుకొంటేగాని సామాన్యంగా అనుకూలమైన పరిస్థితులలో రావని ప్రభుత్వం గుర్తించాలి. అందువల్ల పేదజనులకు ఒక్కొక్క కుటుంబానికి అయిదుఎకరాల భూమి యిచ్చినంత మాత్రాన యీ సమస్య పరిష్కారం కాదనే విషయం మీ కందరికి తెలుసు. కాబట్టి యీవిషయములో ఈజిల్లాలలో కలెక్టర్లు యింకను ప్రభుత్వోద్యోగస్థుల ద్వారా తప్ప ఈ భూములును సాగులోనికి తీసుకునిరావడానికి అవకాశముండదు. భూములులేని పేదవాళ్ళకు, కేవలం వ్యవసాయంమీద ఆధారపడి జీవించే పేదవాళ్ళకు యీభూములను యివ్వటమనేది చాలా మంచిదని నాఅభిప్రాయము. వ్యవసాయం చేయటానికి శక్తిలేనివాళ్ళకు, ఆసక్తిలేనివాళ్ళకు యీ భూములు యిచ్చినట్లయితే, యీ భూములను ప్రక్కనవున్న ధనవంతులు యితర భూస్వాములు వారి స్వంతాన వుపయోగించుకోటానికి అవకాశంవుంటుంది కాబట్టి అటువంటి వారికి యీభూములను యివ్వకూడదని నాఅభిప్రాయము. శ్రీ ప్రగడ కోటయ్యగారు సూచించినట్లుగా యీభూములను కోఆపరేటివ్ సొసైటీల ద్వారా యిస్తే వీటిని అభివృద్ధికి తీసుకొని రావటానికి వీలవుతుందన్న అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. అంతేకాకుండా పేదవాళ్లు యిచ్చేటప్పుడు అర్ధభాగము వ్యవసాయముచేసుకోలేని స్థితి ఏర్పడ్డప్పుడు, ప్రభుత్వము వారి పరిస్థితులు గమనించి సహాయపడాలి. లేకపోతే వారు నిరుత్సాహపరులై ఆభూములను అన్యాక్రాంతంచేయడమో, లేక విడిచి పెట్టడమో జరుగుతుంది. ఈవిధంగానే వ్యవసాయానికి కావలసిన ఆర్థిక సహాయము, loans, manures వగైరా సప్లయిచేసి, యీ భూములను అభివృద్ధిపరచడానికి ప్రభుత్వము సహాయపడితే, అది ఎంతో సమంజసమైన విషయమని నేను చెప్పగలను. పేదవారికి యీవిషయంలో ఆర్థిక సహాయము చేయవలసిన బాధ్యత ప్రభుత్వముమీద వున్నది. అందులో యీసమస్య యిదివరకెప్పుడో ప్రభుత్వం తీర్చవలసింది. ప్రజలు ఎంతో ఆందోళన చేస్తున్నారు. ప్రభుత్వముపైన నిందలువేయడమనేది మంచిదికాదు. ఈసమస్య చాలక్లిష్టమైన సమస్యకాబట్టి ప్రభుత్వమునకు ప్రజల సహకారముకూడా అవసరమైయున్నది. కాబట్టి ప్రభు

[Sri L. Lakshmana Das] [25th February 1954

త్వము యీ సమస్యను త్వరలో పరిష్కరించటానికి పూనుకోవలసిందని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

ఈ విషయములో ప్రత్యేకంగా ప్రభుత్వము రాబోవు పదిరోజులలో సభ్యులు దీన్ని చట్టరూపములో తీసుకురావటానికి సూచనల కొరకు ఒక కమిటీని వేసి, యీ సమస్యకు పరిష్కారమార్గాలు ఆలోచించవచ్చును ఈసమస్య చట్టరూపములో తెచ్చి అమలులో పెట్టినట్లైతే, పేద ప్రజలు బ్రతుకటానికి వీలవుతుంది. ప్రభుత్వముగూడా వీరికి ఎంతో సహాయము చేసినవారగమవుతారు. అంతేకాని కేవలము యీ శాసనసభలో ఉపన్యాసాలు యిచ్చినందువల్ల ప్రయోజనముండదని శ్రీ నాగిరెడ్డిగారు గుర్తించమనీ కోరుతున్నాను. ప్రభుత్వము జిల్లాలలోవున్న కలెక్టర్లను, డిప్యూటికలెక్టర్లను నియమించి, దీనికి కావలసిన particulars ను సేకరించి ప్రభుత్వానికి త్వరలో అందజేయవలసిందిగా instructions పంపమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను?

మరొకవిషయం చెబుతున్నాను. గ్రామాలలో పశువులు వ్యవసాయానికి ముఖ్యంగా అవసరము అని అందరికి తెలిసినవిషయమే. వాటికి త్రాగుటకు నీటివసతులు, గడ్డి వగైరా వసతులు కల్పించవలసియున్నది. చాలామంది పేదప్రజలు యీ పశువులను కొనలేక, కొంటే మేపేశక్తిలేక వ్యవసాయము చేయలేక భూములను విడిచిపెట్టే పరిస్థితులు వున్నవి. ఈ విషయములోగూడా పేదవారికి ప్రభుత్వము సహాయపడాలి. ఈనాడు ప్రభుత్వమువద్దవున్న నలభైలక్షల యకరాలభూమి ప్రజలకు పంచేటప్పుడు వాటివల్ల ప్రభుత్వం ప్రజలవద్దనుంచి విశ్వాసము సంపాదించగలరని నమ్ముచున్నాను. ఈ సమస్య యింతవరకు పరిష్కారము కాకపోయినందువల్ల ప్రజలు ప్రభుత్వంమీద నిందారోపణలు వేయ ప్రారంభించారు. వృథాగా నిందలువేసి లాభములేదు. ఈ విషయములో ప్రజల సహకారముకూడా అవసరమయినందున, ప్రజలకు ప్రభుత్వానికి హెచ్చరికచేస్తూ, ప్రభుత్వమువారు ఈ బంజర్ల విషయములో త్వరలో ఒక చట్టాన్ని అమలులోకి తెత్తురని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri P. Gunnayya:—అధ్యక్షా, ఈ బంజరుభూముల విషయంలో అనేకమంది సభ్యులు అనేకవిధములుగ వారి వారి ఉద్దేశ్యములను వ్యక్తంచేశారు. ఈ విషయమై వారి వారి సంకల్పములను తెలిసు

జేసినారు. ఇంకా అనేకవిషయాలు మాట్లాడినారు. ఈ బంజరుభూముల విషయమై నేను అంతగా చెప్పగల్గినది, చెప్పదలచుకొన్నది లేదు. అందరు సభ్యులూ అన్ని విషయములు చెప్పారు. కాని నేను ఈ విషయమై కొన్నిమాటలు మాత్రమే చెప్పదలచుకొన్నాను ఇదివరలో మద్రాసు గవర్నమెంటులో పూజ్యులైన శ్రీ ప్రకాశంపంతులుగారు రెవెన్యూ మంత్రిగా ఉండేటప్పుడు, ఆ ప్రభుత్వం ఈ బంజరుభూముల విషయంలో ఏదో చేస్తారని ప్రజలు ఎంతో సంతోషంగా, ఎంతో ఆశతో ఎదురు చూస్తూ ఉండేవారు. అదేవిధంగా ఇప్పుడుకూడా పూజ్యులైన ప్రకాశం పంతులుగారు ప్రభుత్వానికి నాయకత్వం వహించినారు. వారికి సహకారులుగా శ్రీ సంజీవరెడ్డి, శ్రీ కోటిరెడ్డిగారలు పనిచేస్తున్నారు, ఇప్పటికి బంజరు భూములను పేదప్రజలకు పంచాలని ఆంధ్రమంత్రివర్గం ఆలోచించుచున్నారని, దీనివిషయంలో సాధ్యమైనంత త్వరలో బిల్లును తీసుకురానున్నారు. ఇందుకు మన ఆంధ్రమంత్రివర్గానికి నేను నా హృదయపూర్వక అభివందనములను తెలియజేస్తున్నాను. బంజరు భూములు, దాదాపు 30 లక్షల ఎకరముల బంజరు భూములు, మన రాష్ట్రంలో ఉన్నాయి. వీటిని పంచడానికి మన మంత్రివర్గంవారు ఒక బిల్లురూపకంగా చేయాలని ఆలోచించుచున్నారు. ఇది ఎలా ఉన్నదంటే 50 సంవత్సరములనుంచి కాన్పుకాని స్త్రీ ఇపుడు గర్భం దాల్చినట్లున్నది. అంటే ఇదివరలో మద్రాస్ ప్రభుత్వంలో Revenue మంత్రిగా ఉన్నప్పటినుంచి ఈవిషయమై ఏదోచేస్తారనుకున్న పూజ్యులైన శ్రీ ప్రకాశంగారు ఈరోజుకు ఈవిషయమై ఏదో బిల్లురూపంగా ప్రవేశపెట్టబోతున్నారు. వారికి నాహృదయపూర్వకమైన అభివందనములు అర్పిస్తున్నాను. ఈ గర్భిణి 3 మాసముల గర్భిణికాదు. 6 మాసముల గర్భిణి అంటె ఇంకా 3 మాసములలో అంటె ఆడపిల్లో, మొగపిల్లవాడో బిడ్డ బైటపడుతుందన్నమాట. అంటే కొద్దికాలంలోనే ఆబిల్లు మనముందుకు ప్రజలముందుకు వస్తుంది అన్నమాట. అదివచ్చివారికి మేలుకలుగుతుందని అనేక పేదప్రజానీకం ఆశిస్తున్నారు. ఈ బంజరు భూములపంపకం విషయంలో రాజకీయ బాధితులకు బంజరుభూములను ఇవ్వకూడదని కొంతమందిచెప్తూవచ్చారు. వారికి అసలు బంజరుభూములు ఎందుకుఉండాలి ? అవసరమే లేదని అన్నారు. అసలు వారికి రాజకీయ బాధితులు మనకు ఎంత ఉపకారం చేశారో తెలుసా ? అని నేను అడుగుతున్నాను. అసలు 'రాజకీయ' బాధితులవల్లనే మన భారత

[Sri P. Gunnayya] [25th February 1954

దేశమునకు స్వతంత్రం వచ్చినసంగతి జ్ఞాపకం ఉందా వారికి. వాళ్లు అంత కష్టపడి స్వతంత్రం సంపాదించినందులకే మనం ఇపుడు M.L.A. లమై సుఖంగా ఉన్నాము. ఇక్కడ ఈరోజున మాట్లాడుటకు అవకాశం కల్గిందని నేను చెప్తున్నాను. అసలు ఏమీఆస్తిలేక పేదవారైన రాజకీయ బాధితులకు 5, 10 ఎకరముల బంజరుభూముల నివ్వాలి. ఆస్తిగలవారికి అవసరం లేదనుకోండి. వారికి 5, 10 ఎకరముల భూమి యివ్వడానికి, opposition party, ఇంకా ఇతరసభ్యులు ఆమోదిస్తారని నేను అనుకుంటున్నాను. ఇదేవిధంగా యుద్ధంలోంచివచ్చిన మిలిటరీ వారికెందుకు బంజరుభూములను పంచిపెడుతున్నారు అన్నారు. వారు దేశమునకై పోరాడి వచ్చినవారు. అందుచేత వారికికూడా బంజరు భూములను కొద్దికొద్దిగా యివ్వడం సమంజసం. అందుచేత వారికి యివ్వడానికి అందరు ఆమోదించగలరని ఆశిస్తున్నాను. తరువాత ఈ భూములను నిరుపేదలైనటువంటివారికి, అనగా హరిజనులకు, బీద రైతాంగానికి, వ్యవసాయకూలీలకు 2 ఎకరములు, లేక 5 ఎకరముల లోపు పంచేటట్లు ఆబిల్లును తీసుకరావలయునని కోరుతున్నాను. ఈ బంజరు భూములను పేదప్రజలకు పంచవలసినదిగా చాలాకాలం నుంచి మద్రాసు శాసనసభలో చాలామంది మెమొరాండంలు సమర్పించారు. అపుడు రెవెన్యూ మంత్రిగారు అలాగే బంజరు భూముల సమస్యను పరిష్కరిస్తామని చెప్పారు. కాని యింతవరకు ఏమీజరగలేదు. ఇంకా మెమొరాండంలు వస్తూనే ఉన్నాయి. రావణాసురుడి కాష్టం ఎప్పుడూ కాలినట్లుగా ఈ సమస్య ఎప్పటికీ పరిష్కారం కాకుండాఉన్నది ఇప్పటికైనా ప్రభుత్వంవారు, ఏవిధంగా ఈ బంజరు భూముల సమస్యను పరిష్కరించాలో, ఏవిధంగాబంజరుభూమిని ఎవరెవరికిపంచాలో, అనిఆలోచిస్తూ దీనివిషమై ఒకబిల్లును ప్రవేశపెట్టబోతున్నారు. ఇందుకు వారికి నా హృదయపూర్వకమైన అభివందనము లర్పించుచున్నాను. ఈబంజరుభూములను ఏమాత్రం భూవసతిలేని పేదప్రజలు తీసుకొనిఉంటే ఏమాత్రం యిబ్బంది లేదు; కాని ఇప్పుడేమి జరుగుతోందంటే 20,30 ఎకరములుఉన్న రైతులు ఈ బంజరుభూములను ఆక్రమించుకొంటున్నారు. ఈ బంజరు భూములను భూస్వాములే యిపుడు ఆక్రమించి సాగుచేసుకుంటున్నారు. బీదప్రజలు చాలా తక్కువమంది బంజరుభూములను సాగుచేసుకొంటున్నారు. కాని భూస్వాములు చాలా ఎక్కువ బంజరుభూములను ఆక్రమించుకొని సాగుచేసుకొంటున్నారు. చాలాకాలంనుంచి చేసుకుంటున్న

బీదప్రజానీకాన్ని ఆభూములనుంచి తొలగించి దురాక్రమణ చేస్తున్నారు. అందుచేత ఇదివరకటినుంచి బంజరుభూములను సాగుచేసుకొంటున్న వారికి ఆభూములకు వెంటనే పట్టాలివ్వవలయును. ఈ బంజరుభూములను బీదవారికి యిచ్చిన తరువాత వాటినిమరల సాగుచేసుకొనుటకు కొంతఅప్పు లిచ్చి ప్రభుత్వం సహాయపడవలయునని మనవిచేయుచున్నాను. వెంటనే ఆ భూములను అక్కడ బీదప్రజానీకానికి పంచిపెట్టి వాటికి వెంటనే పట్టాలివ్వవలయును. పెద్దపెద్ద భూస్వాములు ఆక్రమించుకొంటున్న భూములను స్వాధీనం చేసుకొని జిల్లాకలెక్టరులద్వారా పేదప్రజానీకానికి పంచిపెట్టవలయును. ఇప్పుడు మాజిల్లాలో చాకలి, మంగలి, మొదలగువారు పేదరైతులు మొత్తం 3 వందల ఎకరములు భూమి సాగుచేసుకొంటున్నారు. వాటికి పట్టాలుయివ్వలేదని శ్రీకరియప్పగారుచెప్పారు. ప్రభుత్వం వారు పేదప్రజానీకానికి, హరిజనులకు, బంజరు భూములను పంచిపెట్టి వాటికి పట్టాలను యిప్పిస్తారని ఆశిస్తూయున్నాను ఈ బంజరుభూములను బీదప్రజానీకమునకు పంచిపెట్టడం విషయమై ప్రభుత్వం ఒక బిల్లును ప్రవేశపెట్టుటకు ఆలోచిస్తూయున్నందుకు వారికి నాహృదయ పూర్వక అభివందనములను అర్పించుచూ ఇంతటితో విరమిస్తున్నాను. బంజరు భూములు 10 మంది హరిజనులుకు యిస్తే 3 గ్గురు సవర్ణులకు ప్రభుత్వము యిప్పిస్తారని నమ్ముచున్నాను.

Sri C. Subbarayudu :—అధ్యక్షా ! ఈ బంజరు భూములను పంచడం విషయంలో అందరికీ భేదాభిప్రాయములు కల్గుతున్నాయి. ఈ విషయమై ఒక చట్టాన్ని ఆచరణలో పెట్టటంలో మాత్రం సక్రమంగా ఉండడంలేదు. ఈబంజరు భూములను పంచిపెట్టుటకు ముందు వాటిని జమీందారులవద్దనుంచి, పెద్దరైతులవద్దనుంచి స్వాధీనం చేసుకొని వాటిని ఆయాప్రాంతములలోని బీదప్రజలకు, హరిజనులకు వ్యవసాయ కూలీలకు పంచిపెట్టాలి. ప్రభుత్వంవారు బంజరుభూములను పేదప్రజలకు assign చేసినతరువాత వాటికి పట్టాలను యివ్వడంలేదు. బీదలకుబంజరుభూములను assign చేయక ముందేవాటినిజమీందారులు, భూస్వాములు ఆక్రమించుకున్నచో ఆభూములను వారినుండి స్వాధీనము చేసుకోవాలి. బీదవారికి వాటిని assign చేసినతరువాత వాటికి పట్టాలు యివ్వనందువల్ల వాటిని ఇతరులు ఆక్రమించుకొంటున్నారు. అందువల్ల వారికి ఆభూములను assign చేసిన వెంటనే పట్టాలివ్వవలయును. ఏ ప్రాంతములోనున్న భూమిని ఆయాప్రాంతములోని బీదప్రజలకు

[Sri C. Subbarayudu] [25th February 1954

కేటాయించాలి. అచ్చట ఉన్న ప్రజలసంఖ్యనుబట్టి, భూమినిబట్టి వారికి 5 ఎకరాలు, 8 ఎకరాలు 10 ఎకరాలువరకు పంచిపెట్టవలయును. నందికొండ ప్రాజెక్టు నీటిపారుదల స్కీముదగ్గ, ఆ ప్రాంతములోనున్న బంజరు భూమిని ఒక్కొక్కనికి 5 ఎకరముల చొప్పున పంచియిచ్చినట్లైన అచటి వారు వానిని సాగుచేసుకొ డానికి వీలుగాఉంటుంది. అసలు మనరాష్ట్రంలో ఉన్న బంజరుభూమిని అందరకూ కేటాయించవలెను. ఇప్పుడు మన రాష్ట్రంలో ఉన్న బంజరుభూములను అంతనీ పంచివేస్తే ప్రతి బీదవానికి అధమపక్షం ఒక 5 ఎకరాలైనా భూమివసతి ఉంటుంది. అందుచేత ప్రభుత్వంవారు బంజరుభూములను, అడవిప్రాంతములలోనున్న భూమిని జమిందారులనుంచి భూస్వాములనుంచి స్వాధీనముచేసుకొని దానిని బీదప్రజలకు అందరికీ పంచిపెట్టి భూమిలేనివారికి భూవసతి కల్గించవలయునని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇప్పుడు మనరాష్ట్రంలోనున్న బంజరు భూములకు నీటిపారుదల, నీటివసతి కల్గేలాగున నీటిపారుదల పనులను మన ప్రభుత్వం సత్వరమే చేయించవలయును. ఈవిషయమే ప్రభుత్వం తగు చర్యలు తీసుకొనుటకు ఆలోచించి ఈ బంజరుభూములను పంపకము చేయవలయునని కోరుతున్నాను. అంతేకాకుండా బీదరైతులకు కో-ఆపరేటివ్ సొసైటీలను ఏర్పాటుచేసి వ్యవసాయము చేసుకొనుటలో వారికి తగుసహాయం చేయాలి. కో-ఆపరేటివ్ సొసైటీలను ఏర్పాటు చేసి వారిని అందు చేర్చుకొని వారికి వ్యవసాయపు పనిముట్లు, విత్తనములు, మొదలైనవి సరఫరాచేసి వారికి సహాయము చేయవలయును. అంతేకాకుండా రాజకీయపార్టీలు కాంగ్రెస్‌పార్టీ కాని, కమ్యూనిష్టుపార్టీ కాని అనేక పార్టీలు ఉన్నాయి జమీందారులచేత ధనసంబంధమైన సహాయం చేయించడమేకాకుండా శ్రమదానంకూడా చేయించినట్లైతే దేశం బాగుపడుతుంది. వట్టి reforms పెట్టడమేకాదు. ఆలా చేసినచో మార్గదర్శకంగాకూడా ఉంటుందనిచెప్పి మీఅందరికీ విజ్ఞప్తిచేస్తున్నాను.

**Mr. Speaker**:—I find tedious repetitions in the speeches of hon. Members. There are yet about 12 members to speak.

**Sri K. Venkaiah**:—ఇప్పుడు ఈ ఉపన్యాసాలు ఆపి దీనిమీద మంత్రిగారు సమాధానం ఇచ్చి వెంటనే దీన్ని ఓటింగ్‌కు పెట్టడం మంచిదని కోరుతున్నాను.

**Mr. Speaker**:—I do not want to displease anybody and I am not closing the discussion now.

25th February 1954]

Sri S. Narayanappa :— ప్రతిపక్ష సభ్యులుగా వున్నటువంటి వెంకటేశ్వర్లుగారు, వెంకయ్యగారుకూడా మాట్లాడారు. బంజరు భూముల విషయంలో ప్రతిపక్ష సభ్యులు, ప్రభుత్వ సభ్యులు కూడా సూచనలుచేశారు. నేనుకూడా కొన్నిసూచనలు చేస్తున్నాను. ప్రతి గ్రామంలోను గ్రామనిర్మాణానికిజరిగే కృషివిషయంలో, అంటే గ్రామా నికి అవసరమైన అష్టవృత్తులు నిర్మాణానికి అవసరమై నటువంటివి ఉన్నాయి. అవి ఏవంటే కుమ్మరి, కమ్మరి, మంగలి, చాకలి మొద లైనవి. ఆ వృత్తులపై ఆధారపడి ఉన్నవాళ్ళకుకూడా కొద్ది పొలాలు ఉండటం అవసరం అని నేను మనవిచేస్తున్నాను. ఈ పోరంబోకులన్నీ కూడా సమగ్రంగా పరిశీలించి, ఎవరికీబాధ లేకుండా పంపకంచేసేవిషయం ప్రభుత్వం జాగ్రత్తగా పరిశీలించాలి. ఈ భూములన్నింటిని చేనేతవారి శ్రామికులకు, భూమిలేనివాళ్ళకు, landless poor క్రింద పేదవాళ్ళకు ఇచ్చే సావకాశం కల్పించాలని మనవిచేస్తున్నాను. కోపరేటివ్ సొసైటీస్ క్రింద ఈ భూములను సాగుచేయడం చాలా కష్టమని చెప్పారు. కాని ఈ విషయంలో జిల్లాకి ఒకసమిష్టివ్యవసాయక్షేత్రాన్ని ఏర్పాటుచేసి ఎరువులు మొదలైనవాటిని ఈ కోఆపరేటివ్ సహకార సంఘాలద్వారా సరఫరా చేయాలని కోరుతున్నాను. ఇప్పుడు పెద్దపెద్దభూస్వాములు ఆక్రమించిన భూములమీద వెంటనే చర్య తీసికొని పంపకంజేయాలని మనవిచేస్తు న్నాను. రాజకీయ బాధితులకు, ఎక్స్ సర్వీస్ మెన్ కుకూడా భూములు కేటాయించారు. వాటిని మినహాయించి భూముల పంపకాన్ని అనుసరిం చాలి. అయితే ఈ రాజకీయ బాధితులక్రింద నాకేమీ సెంటుభూమి కూడా లేదు. నాకు భూమి ఇచ్చారు. కాని ఆ ఇచ్చినది ఒక భూస్వామి చేతులో ఉంది. తిరిగి కలెక్టరుదగ్గరకు పోయి ఈవిషయం తెలియపర్చి ఏదైనా చర్య తీస్కోమని వారినికోరాను. 6 వ సెక్షనుక్రింద ఆ భూస్వా మిని తొలగించి ఆ భూమిని నాకు ఇచ్చేటట్లు చేశారు. కాని అయన మళ్ళీ ఒక వకీలును పెట్టుకొని అప్పీలుచేశాడు. సెక్షన్ ను రద్దుచేస్తే వెంటనే ప్రభుత్వం స్టేఆర్డరు ఇచ్చింది. ఇటువంటి సందర్భములో భూమి ఉందా లేదా అని పరిశీలన చేయకుండా భూమిలేనివాళ్లు రాజకీయబాధితుల క్రింద వచ్చినప్పుడు వాళ్ళమీద సీతకన్నుపెట్టి వాళ్లకు భూమి ఇవ్వ డానికి ప్రయత్నం చేయకుండా ఉండటం చాలా విచారకరం. అటువంటి ప్రయుతం ఈ నాడు లేదా ? ఒకవేళ దానిమీద నేను దావాచేస్తే ఇంకో 14 సంవత్సరాలు కావాలి అది తేలడానికి. ఇటువంటిపరిస్థితులు రాకుండా

[Sri S. Narayanappa] [25th February 1954

స్టేఆర్డర్లు ఇవ్వకుండా ఉంటారని నమ్ముతున్నాను. నాకు అవకాశంఇచ్చిన అధ్యక్షులవారికి నాకృతజ్ఞత తెలుపుతున్నాను.

Mr. Speaker :—I am closing the debate. The Hon. the Chief Minister will speak now.

The Hon. Sri T. Prakasam :—I have to say something...

An hon. Member:—తెలుగులో మాట్లాడండి.

The Hon. Sri T. Prakasam:—నేను కొన్నిమాటలు చెప్ప తలచుకున్నాను. ఏమంటే చాలాగొప్పచర్చ జరిగిందిక్కడ. శ్రీ నాగేశ్వ రావుగారి తీర్మానంమీద ఈ చర్చ అంతా జరిగింది. దానిమీద సవరణలు పెట్టారు. దానిమీద కొందరు మాట్లాడారు. ఇప్పుడు నేను మీద్వారా సభ్యులందరికి తెలియచేసే సంగతి కొంతవరకు ఇదివరకు గా॥ శ్రీ సంజీవరెడ్డిగారు చెప్పివున్నారు. ఇతరులుకూడా చెప్పివున్నారు. ఈవిషయంలో అభిప్రాయభేదంలేకుండావున్నది. నేనుయిక్కడ సభ్యులకు తెలియని విషయం కొద్దిగా చెప్పతలచుకొన్నాను. ఈ శ్రీ నాగేశ్వరావు గారి తీర్మానంలో ఎన్నిసంగతులు ప్రశాడో అవన్నీకూడా మేము గవర్నమెంటుసైడ్‌లో ఉండేవాళ్లంకూడా ఆలోచించుకొన్న సంగతులే వున్నాయికాని వేరేమీ లేదు. ఆయన చెప్పిన సంగతులు అన్నికూడా అంగీకరించినా వెంటనే కార్యక్రమం ఎట్లా జరగడం అనే అనుమానం వస్తుంది.

ఆయన చెప్పిన సంగతులు రెండురోజులక్రిందిట కలెక్టర్ల మీటింగులో రెవెన్యూబోర్డు మెంబర్లుకూడా వున్నప్పుడు పరిశీలనకు వచ్చాయి. బంజరు భూములన్నికూడా యివ్వవచ్చునా యివ్వకూడదా అని ప్రభుత్వం తరఫున పనిచేసేవాళ్లు పరిశీలించి చెప్పవలసి వున్నది. కొంతచర్చ అయిన తర్వాత మాకుతోచిన సంగతేమిటంటే ఈ విషయం కొంతకాలం వాయిదావేయక తప్పదని, మీరు చెప్పే ఆటంకాలన్నీకూడా దాటవలసి వున్నదనీ పూరికే ఆలోచిస్తాము చేస్తాము అని చెప్పినందువల్ల ప్రయోజనం లేదని చెపుతున్నాను. ప్రతిజిల్లాలోను ఎంత బంజరుభూమివున్నదీ నాగేశ్వరావుగారి తీర్మానంలో చెప్పిన మోస్తరుగా ఏ యే గ్రామంలో బంజరుభూమి ఎంతవున్నదో అందులో ఎంతభూమి మంజూరుచేయడానికి వీలుంటుందో మీరు లెక్కలేమైనా తయారు చేసుకువచ్చారా అని కలెక్టర్లను రెవెన్యూబోర్డు మెంబర్లను అడిగాము. ప్రతి జిల్లాలోను ఎంత

బంజరుభూమి ఏవిధమైన అడ్డంకులు లేకుండా వెంటనే యివ్వడానికి వీలవుతుందో మాకులెక్కలు కావాలి. ఆ సందర్భంలో ఎటువంటి controvercies పనికిరావు. ఈ information యివ్వడానికి తయారయి రాలేదని రెవెన్యూబోర్డు మెంబర్లు చెప్పారు. 15 రోజుల వ్యవధియిస్తే చేస్తామన్నారు. ఈతీర్మానంలో మీరు చెప్పినా చెప్పకపోయినాఅదితప్పక జరిగేపనే. ఒక్కొక్క జిల్లాలోపని ఆ జిల్లాకు సంబంధించిన కలెక్టరు ద్వారా జరగాలికనుక ఇప్పుడు ఎంతభూమి వున్నదో చూచి, ఇతరకారణాలవల్ల యివ్వకూడని భూమిని అటుంచి మిగతాభూమి మనం యివ్వదలచిన వాళ్లకు యివ్వడానికి తగిన లెక్కలు తయారు చేసుకురమ్మని చెప్పాము. అందుచేత ఆపని అంతటితో ఆగిపోయింది. నాగేశ్వరరావుగారి తీర్మానంలోకూడా ఈసంగతిని తేల్చుకోవాలి. మీరు దానిమీద చేసినచర్చ చాలామంచిది. తెలుసుకోవలసిన సంగతులు తెలుసుకున్నాము. లక్ష్మణదాసు చెప్పినసంగతులు చాలా స్పష్టంగావున్నాయి. ఎంతబంజరుభూమి దేశంలోవున్నదీ, దానిని ఏplans మీద distribute చెయ్యాలి అనే సంగతిముందు అందరుచూచుకోవాలి. బిల్లు సంగతికూడా మీరు మాట్లాడుతున్నారు. ఇది బిల్లుగానే రావాలిగాని ఇంకోకవిధంగా రావడానికి వీలులేదు. ఇందులో అన్ని considerations వుండాలి. ఇక్కడ మీరు వోటింగు తీసుకోనవసరం లేకుండా వుండేందుకే నేను దీనికి back ground చెప్పాను. మనం మళ్లీ కలుసుకుందాము. ఇది సామాన్యమైన విషయంకాదు. చాలామంది సహాయం మాకు కావాలి అందరి సహాయముతీసుకుని మరీచేస్తాము. నాగేశ్వరరావుగారి తీర్మానంలో చెప్పిన ప్రకారమే మేము చెయ్యదలుచుకున్నాము. కాబట్టి దీనిమీద వోటింగు అనవసరంలేదు. మీకు వోటింగు కావలిస్తే తీసుకోవచ్చు ఈ మాటలు చెప్పడము కోసమే మిమ్మల్ని కొంచెంసేపు ఆపుచేశాను.

The Hon. Sri K. Koti Reddi :—అధ్యక్షా, ఈ తీర్మానాన్ని గురించి చాలామంది సభ్యులు చర్చచేసివున్నారు. ఇదివరకు ప్రభుత్వం ఈ బంజరు భూముల విషయంలో ఏలాటి ఉద్దేశ్యం పెట్టుకొన్నదీ బడ్జెట్ సమావేశంలో చెప్పినాము. బంజరుభూముల పంపకం విషయంలో ప్రతిపక్షాలకు ఎంత త్వరలో వీటిని గురించి పరిష్కారం చెయ్యవలెననే ఆతురతవున్నదో అంత ఆతురత కూడా ప్రభుత్వానికి వుందని చెప్పుతున్నాను. ఇదివరలో చర్చవచ్చినప్పుడు దీని విషయంలో కరణాలు ఎన్నో అన్యాయాలు చేస్తున్నారనీ, దానిని తహసిల్దార్లు, కలెక్టర్లు

[The Hon. Sri K. Koti Reddi] [25th February 1954

మాపుచేస్తున్నారని చెప్పారు. అందువల్ల ఈ విషయాన్ని చిన్న ఉద్యోగస్తులకు వప్పజెప్పేమంటే సక్రమంగా జరగదు. పెద్ద ఉద్యోగస్తులకు యిస్తే రెండుమూడు నెలల్లో పరిష్కారం కావడం ఎట్లాగో ఆలోచించండి. కాబట్టి పేదలకు అపకారము, ఆలశ్యము జరగకుండా ఏవిధంగా చేస్తే ఇది సాధ్యమవుతుందో ప్రత్యేకమైన staff పెట్టాలో లేక non-official కమిటీని వెయ్యాలో ఆలోచిస్తున్నాము. మనకు కావలసిన information తహసిల్దార్లు, కలెక్టర్లనుంచి తెప్పించడం ఆలస్యం అవుతుంది ఈ విషయంలో ప్రభుత్వానికి ఏలాటి దురుద్దేశ్యము లేదని మీరు నమ్మాలి. ఈ విషయంగురించి ఎలాంటి దురుద్దేశం లేదని నమ్మండి. అందువల్ల చిన్న చిన్న విషయాలలో మీకు మాకు అభిప్రాయ బేధాలువుండవచ్చు. మొత్తానికి బీదలకు బంజరు భూములను పంచాలనే ఉద్దేశ్యం మాకూవున్నది. మీకూవుండవచ్చు. మీకూ వున్నది, మాకూవున్నది. అందరకూవున్నది. ఇక నావిషయంగురించి కొందరుచెప్పారు. నాకు ఎదో ఈనాంభూమి ఉన్నదని అందువల్ల నేను బహుశా ఎదో వ్యతిరేకంగా వుంటానని, అలాచెప్పిన మెంబరుకు దాని వల్ల నేను ఎంతమాత్రంగా లాభం పొందుతున్నానో తెలుసుననుకుంటాను. అదికూడా ఆయన చెప్పివుంటే బాగుండేది. కడపదగ్గర ఎదోవున్నదనుకోండి, ఎవరో పుణ్యాత్ముకు రైతులు తీసుకుంటారు, సర్కారుకు కట్టవలసింది నామీాద పడుతూవుంటుంది. అంతకుపైగా నేను అనుభవిస్తున్నది ఏమిలేదు. అందువల్ల మీకు కూడా ఈవిషయం తెలుసును. రెండవది, ప్రభుత్వానికి ఈ విషయంగురించి ఎంత ఆతురతవున్నదో చూపడానికి ఒక example చూపి విరమిస్తాను. లంకలగురించి కొంత మందిచెప్పారు. తూర్పుగోదావరిలో confirm అయిన లంకల గురించి legal openion ను కనుక్కుంటే అవతలవారు legal suit తీసుకురావచ్చునని చెప్పారు. నేనువెళ్ళినప్పుడు ఇవన్నీ ఆలోచించడం జరుగకుండా బీదలకు ఇస్తామన్నట్లు చెప్పాను. తరువాత legal position చూస్తే ఇబ్బంది వచ్చింది. అయినా కలెక్టర్లకు వ్రాసి auction లో కొనేట్లాచేసి field labour society లకు ఇప్పించేట్లా చేశాము ఆ విషయం బొజ్జా అప్పలస్వామిగారికికూడా తెలుసును. ఈ విషయం బట్టి ప్రభుత్వం పేదలకు సహాయం చేయడానికి సిద్ధంగావున్నదని తెలుస్తుంది. కొల్లేరుభూముల గురించి కూడా చెప్పారు. 2, 3 సంవత్సరాలుగా భూస్వాములు

చేసుకునేదానిని స్వంతంగాపోయి విషయం విచారించి field labour society కి 80 ఎకరాలు lease ఇచ్చారు. ఈ ప్రభుత్వం తప్పకుండా బీదలకు మేలుచేయాలని చూస్తోందని చెప్పడానికి ఈ instances చాలు వీటన్నింటిని గమనించి మీరు మీతీర్మానాన్ని withdraw చేసుకుంటారని అనుకుంటాను. ప్రతి particular విషయంమీద ఏకీభవించ లేక పోయినా, general గా మీరు అంతా చెప్పినదానితో నేను ఏకీభ విస్తున్నాను.

Sri Pillalamarri Venkateswarlu :—ఒకవిషయం; పెనాలిటీల తగ్గింపుగురించికూడా ఏమైనా చెబుతారా ?

The Hon. Sri T. Prakasam :—Penalties ను గురించి మీరు అడగకుండా వుంటేనే మీకు మంచిది. ఎవరితరఫున మీరు మాట్లాడు తున్నారో వారికి మంచిది.

Mr. Speaker:—In view of the assurance by the Government, is the mover of the resolution prepared not to press it?

Sri T. Nagi Reddi: ప్రభుత్వం ఈ తీర్మానంతో ఏకీభవిస్తోంది కాబట్టి amendments అన్నీ withdraw చేసి unanimous గా pass చేద్దాం. తరువాత details తో బిల్లును తీసుకువస్తామంటున్నారు. Amendments అన్నీ details కు సంబంధించినవి కాబట్టి withdraw చేసుకోవచ్చును.

Mr. Speaker :— There should not be even one dissentient voice.

Then, all the amendments are deemed to have been withdrawn.

All the amendments were, by leave of the House, withdrawn.

I will now put the main motion to the vote of the House.

The question is :

"This Assembly recommends to the Government that all Government assessed, unassessed and unobjectionble and cultivable poramboke lands (either wet or dry) under the occupation and cultivation of any person possessing five or more acres be taken over by Government at once and assigned to the landless poor free of market value."

[Sri Mr. Speaker] [25th February 1954

The motion was unanimously carried.

Mr. Speaker :—There is one more point on which I want to consult the House. If the House is agreeable, I will adjourn the House to 9-30 a. m. tomorrow and we shall sit till 12-30 with no afternoon session. Day-after-tomorrow we may sit from 4 p. m. to 7 p. m. and that we shall decide tomorrow.

Hon. Members :—Yes, we will meet at 9-30 a. m. tomorrow.

Mr. Speaker :—I adjourn the House to meet at 9-30 a. m. tomorrow.

The House then adjourned.